ఈనాడు

ఆదివారం ఆగస్టు 25, 2024

# గాంధీమార్గమే సమాజానికి ఊతం



గాంధీభవన్‌లో రాట్నం తిప్పుతున్న ముఖ్యమంత్రి సిద్ధరామయ్య, మంత్రి హెచ్.కె.పాటిల్ తదితరులు

**బెంగళూరు (యశ్వంతపుర), న్యూస్‌టుడే :** సమాజంలో సామాజిక న్యాయంపై నమ్మకంలేక- అసమానతలు ప్రోత్సహించే శక్తులే మహాత్మాగాంధీ హత్యకు కారణమని ముఖ్యమంత్రి సిద్ధరామయ్య ఆవేదన వ్యక్తం చేశారు. గాంధీ స్మారక నిధి 75వ వార్షికోత్సవాల సందర్భంగా శనివారం ఇక్కడ గాంధీభవన్‌లో ఏర్పాటు చేసిన కార్యక్రమాన్ని ఆయన ప్రారంభించి ప్రసంగించారు. కుల, మతాల పేరుతో ఆ శక్తులు అసమానతలను ప్రోత్సహిస్తున్నాయని ధ్వజమెత్తారు. కుల వ్యవస్థ కారణంగా బహుజనులు విద్యకు దూరమయ్యారని వాపోయారు. ప్రస్తుతం విద్యావంతులే కులవాదులు కావడం బాధాకరమన్నారు. కుల- మత అసమానత పోషకులే మహాత్మాగాంధీని హత్య చేశారని ఆగ్రహం వ్యక్తం చేశారు. అలాంటి శక్తులనే నేడు కొంధరు పూజించడం సమాజ దౌర్భాగ్యమన్నారు. బాపూజీ చూపిన సిద్ధాంతాలు నేటికీ అనుసరణీయమన్నారు. ఆయనను మరచిపోతే.. భారతీయ సమాజాన్ని విస్మరించినట్లేనని నేటితరాన్ని హెచ్చరించారు. శాంతి, సత్యం, న్యాయం, సోదరభావం జీవితాంతం ఆచరించాలని సూచించారు. వ్యక్తుల మధ్య అసహనం ఏర్పడితే సమాజం నాశనమవుతుందని హెచ్చరించారు. ప్రకృతి మన అవసరాలను తీర్చుతుందేగానీ దురాశ తీర్చబోదని హితవు పలికారు. మూఢనమ్మకాలు, కర్మసిద్ధాంతాలను కొందరు ఉపాధ్యాయులూ అనుసరించడం శోచనీయమన్నారు. కన్నడ సమాజంలో 850 సంవత్సరాల కిందట బసవేశ్వరుడు కర్మసిద్ధాంతాన్ని తిరస్కరించారని ఉటంకించారు. దేశంలోని 85 శాతం సంపద ఒక శాతం శ్రీమంతుల చేతుల్లో ఉందని, ఈ పరిస్థితి మారాలన్నారు. ఆర్థిక అసమానతలు తొలగించేందుకు గాంధీ పలు సూచనలు చేశారని వివరించారు. ఆయన కలలుగన్నట్లు మహిళలు క్షేమంగా మనగలగాలన్నారు. కార్యక్రమంలో గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు రామచంద్ర రాహి, మంత్రి హెచ్. కె. పాటిల్, స్మారక నిధి కార్యాధ్యక్షుడు కృష్ణకుమార్, న్యూదిల్లీ గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు సంజోయ్‌సింగ్ తదితరులు పాల్గొన్నారు.

ఈనాడు
కర్ణాటక



## పాలికెపై హైకోర్టు ఆగ్రహం

బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే : రహదారులపై గుంతలను యుద్ధ ప్రాతిపదికన పూడ్చాలంటూ ఇచ్చిన ఆదేశాలను పాటించడంలో బెంగళూరు పాలికె పూర్తిగా విఫలమైందని ఉన్నత న్యాయస్థానం వ్యాఖ్యానించింది. పాలిక తీరు పట్ల అసంతృప్తిని వ్యక్తం చేసింది. గుంతలను పూడ్చాలని 2016లో విజయ్ మెనన్ వేసుకున్న అర్జీ విచారణ ఇప్పటికీ కొనసాగుతూ ఉండడం దురదృష్టకరమని జస్టిస్ పి.బి.వరాళె వ్యాఖ్యానించారు. ఇప్పటి వరకు పూడ్చిన గుంతలు, అవి ఏర్పడేందుకు కారణాలు, పూడ్చేందుకు అనుసరిస్తున్న నూతన సాంకేతికత తదితర వివరాలు ఇవ్వాలని పాలికెను ఆదేశించిన న్యాయమూర్తి.. తదుపరి విచారణను నవంబరు 2వ తేదీకి వాయిదా వేశారు.

### *ఆ అధికారులను విచారించండి..*

బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే : యలహంక వలయం కొడిగేహళ్లి, కోతి హోసహళ్లి గ్రామాల్లో ప్రభుత్వ భూములు కబ్జా చేసి, అపార్ట్‌మెంట్లను నిర్మించుకునేందుకు అనుమతులు ఇచ్చిన అధికారులను విచారించాలని బెంగళూరు నగర జిల్లాధికారికి హైకోర్టు సూచించింది. నాలుగు వారాల్లో విచారణ పూర్తి చేసి నివేదిక ఇవ్వాలని ఆదేశించింది. అధికారులు లంచాలు తీసుకుని అపార్ట్‌మెంట్లు కట్టుకునేందుకు అనుమతులు ఇచ్చారని స్థానికుడు అశ్వత్థ నారాయణ గౌడ వేసుకున్న ప్రజా ప్రయోజనాల వ్యాజ్యాన్ని విచారించిన జస్టిస్ పి.బి.వరాళె వచ్చేనెలకు విచారణను వాయిదా వేశారు.

# అక్షర తపస్వి.. రామయ్య!

బెంగళూరు (సదాశివనగర), న్యూస్‌టుడే : సీనియరు విలేకరి పి.రామయ్య పత్రికారంగంలో ఒక తపస్వి అని ముఖ్యమంత్రి బసవరాజ బొమ్మై కొనియాడారు. 'నేను హిందూ రామయ్య' పేరిట తన జీవిత అనుభవాలతో రాసిన పుస్తకాన్ని గాంధీభవన్‌లో గురువారం ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ఆవిష్కరించి మాట్లాడారు. 'హిందూ' దినపత్రికలో విలేకరిగా ఆయన నిష్ఠావంతమైన జీవితాన్ని గడిపారని గుర్తు చేశారు. వాస్తవాలనే అందరికీ అర్థమయ్యేలా వ్యాసాలు రాశారని తెలిపారు. రెండు తరాలకు చెందిన రాజకీయ నాయకులు, మూడు తరాల విలేకరులను ఆయన చూశారన్నారు. నిజాలను రాయడంలో రామయ్య ఎన్నడూ వెనుకంజ వేయలేదన్నారు. గతంలో పేద పాత్రికేయులు అనేవారని- ఇప్పుడు కాలంతో పాటు వారిలోనూ మార్పులు వచ్చాయని తెలిపారు. వయసుతో పాటు అభిప్రాయాలు, వ్యక్తిత్వం మారుతుందని, రామయ్య వ్యక్తిత్వంలో ఇప్పటికీ మార్పు రాలేదని అన్నారు. తన తండ్రి ఎస్.ఆర్. బొమ్మై, దివంగత ముఖ్యమంత్రి రామకృష్ణ హెగ్డే, దివంగత ఉప ముఖ్యమంత్రి ఎం.పి.- ప్రకాశ్‌లతో ఆయన సన్నిహితంగా ఉండేవారని గుర్తు చేశారు. తన తండ్రికి సంబంధించిన పలు విషయాలను రామయ్యను అడిగి తెలుసుకున్నానని చెప్పారు. రామయ్య కన్నడిగుల ఆస్తి అని పేర్కొన్నారు. గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు వూడె పి.కృష్ణ, అభిమాని ప్రచురణ సంస్థ అధ్యక్షుడు టి.వెంకటేశ్, సీనియరు విలేకరి హుణసవాడి రాజన్, మాధ్యమ అకాడమి అధ్యక్షుడు సదాశివ శెణై, వర్కింగ్ జర్నలిస్టుల సంఘం అధ్యక్షుడు శివానంద తగడూరు, బెంగళూరు ప్రెస్‌క్లబ్ అధ్యక్షుడు శ్రీధర్, సమాచార శాఖ విశ్రాంత అధికారి హెచ్.బి.దినేశ్ తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు.



పుస్తకాన్ని ఆవిష్కరించి ప్రదర్శిస్తున్న ముఖ్యమంత్రి బొమ్మై తదితరులు



బొమ్మై.. రామయ్య మాటామంతీ

# విదేశాల్లోనూ విపణి మార్గాలు దండి

**బెంగళూరు (యశ్వంతపుర), న్యూస్‌టుడే :** విదేశాల్లోనూ భారతీయ మహిళలు పారిశ్రామికవేత్తలుగా రాణించాలని ముఖ్యమంత్రి బసవరాజ బొమ్మై పిలుపునిచ్చారు. రాష్ట్ర స్వయం సేవా సంస్థల సమాఖ్య, కర్ణాటక సరిహద్దు ప్రదేశాల అభివృద్ధి ప్రాధికార, గాంధీ స్మారక నిధి, సుమంగలి సేవా ఆశ్రమం సంయుక్తంగా బుధవారం ఇక్కడి గాంధీభవన్‌లో ఏర్పాటు చేసిన రాష్ట్ర స్థాయి స్వయంసేవా సంస్థల సమావేశాన్ని ఆయన ప్రారంభించారు. ఈసందర్భంగా మాట్లాడుతూ విదేశీ మహిళలు ఇక్కడికి వచ్చి సంస్థలు స్థాపించి లాభాలు గడిస్తున్నారని గుర్తు చేశారు. ఇక్కడి స్త్రీశక్తి బృందాలు ఆర్థికంగా బలోపేతం కావడంతో పాటు ఉత్పత్తి చేసిన వస్తువులు విదేశాల్లో విక్రయించేలా ప్రణాళికలు రూపొందించాలని సూచించారు. ఆర్థికంగా మరింత బలోపేతం కావాలని దిశానిర్దేశం చేశారు. మహిళలకు సరైన గౌరవ మర్యాదలు కరవయ్యాయని అసంతృప్తి వ్యక్తం చేశారు. మహిళలు పడే శ్రమకు ఫలితం దక్కడం లేదన్నారు. స్వచ్ఛంద సంస్థలు ప్రజలకు సహాయం చేస్తున్నాయని, పేదలకు అండగా ఉంటే సేవకులంతా ఉన్నత స్థాయికి ఎదుగుతారని తెలిపారు. మహిళ సంఘాలు చేసే పనులకు ప్రభుత్వం అన్ని విధాలుగా సహాయ సహకారాలు అందిస్తున్నట్లు వివరించారు. భారతీయ మహిళలు పొదుపులో సిద్ధహస్తులని- విదేశీ మహిళలు ఖర్చులో ముందుంటారని విశ్లేషించారు. కార్యక్రమంలో కేంద్ర వ్యవసాయ శాఖ సహాయ మంత్రి శోభాకరంద్లాజె, రాష్ట్ర పరిశ్రమల శాఖ మంత్రి మురుగేశ్ నిరాణి, ప్రాధికార అధ్యక్షుడు డాక్టర్ సోమశేఖర్ తదితరులు పాల్గొన్నారు. సుమంగలి సేవా శ్రమం నిర్వహకురాలు సుశీలమ్మను ముఖ్యమంత్రి ఘనంగా సత్కరించారు.




దీపం వెలిగించి కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న ముఖ్యమంత్రి బసవరాజ బొమ్మై, కేంద్ర మంత్రి శోభా కరంద్లాజె.

ఈనాడు
epaper.eenadu.net

Date : 01/03/2022

# విద్యార్థుల సత్తా.. ఆకాశమంత!


సదానందగౌడ సమక్షంలో ఒప్పంద పత్రాలు మార్చుకుంటున్న అధికారులు

బెంగళూరు (మల్లేశ్వరం), న్యూస్‌టుడే : దేశంలో మొదటిసారిగా ప్రభుత్వ పాఠశాల విద్యార్థులు ఉపగ్రహం తయారీకి పూనుకున్నారు. ఇహ లోకానికి దూరమైన నటుడు పునీత్ రాజ్‌కుమార్ పేరును ఉపగ్రహానికి పెట్టనున్నారు. జాతీయ విజ్ఞాన దినోత్సవం నేపథ్యంలో మల్లేశ్వరం ప్రభుత్వ పాఠశాల ఆవరణలో నిర్వహించిన సైన్సు ప్రదర్శనను ఐటీ- బీటీ, ఉన్నత విద్యాశాఖ మంత్రి అశ్వత్థనారాయణ, లోక్‌సభ సభ్యుడు డి.వి.సదానందగౌడ సోమవారం ప్రారంభించారు. ఉపగ్రహం నమూనాను ఇప్పటికే తయారు చేసిన విద్యార్థులను ఆయన అభినందించారు. సాధారణంగా ఒక ఉపగ్రహాన్ని తయారు చేసేందుకు రూ.60 కోట్ల వరకు ఖర్చు చేయాలి. ఈ విద్యార్థులు రూ.1.90 కోట్లతో 60 కిలోల బరువు ఉన్న ఉపగ్రహాన్ని సిద్ధం చేస్తున్నారని వివరించారు. ప్రభుత్వం, వివిధ సంస్థల ఆర్థిక సహకారం, శాస్త్రవేత్తల మార్గదర్శనంలో తయారు చేస్తున్న ఉపగ్రహాన్ని సెప్టెంబరు- అక్టోబరు నెలల్లో అంతరిక్షంలోకి ప్రవేశపెడతామని వెల్లడించారు. సైన్సు సాంకేతికతపై ఆసక్తి ఉన్న విద్యార్థులను గుర్తించి ప్రోత్సహించేందుకు, వారి ప్రాజెక్టులకు వాస్తవ రూపం ఇచ్చేందుకు తమ శాఖ వివిధ జాతీయ, అంతర్జాతీయ సంస్థలతో ఒప్పందాన్ని కుదుర్చుకుందని అశ్వత్థ నారాయణ తెలిపారు. భారత దేశంలో అభివృద్ధి పథంలో కొనసాగేందుకు యువత కీలక పాత్రను పోషించాలని లోక్‌సభ సభ్యుడు సదానందగౌడ పిలుపునిచ్చారు. సైన్సు సాంకేతికతలో కర్ణాటక ముందంజలో ఉందని గుర్తు చేశారు. పద్మశ్రీ పురస్కార శాస్త్రవేత్త దాస్ అయ్యప్పన్, ఆయా విద్యాసంస్థల ఉపాధ్యాయులు విజ్ఞాన ప్రదర్శనలో పాల్గొన్నారు.


విద్యార్థులకు ప్రయోగాన్ని వివరిస్తున్న ఉపాధ్యాయుడు


వాననీటి సంరక్షణ విధానం నమూనాను ఆసక్తిగా తిలకిస్తున్న ఉపాధ్యాయులు, విద్యార్థులు

# కొవిడ్ మరణాలు కన్నీళ్లు తెప్పించాయి

బెంగళూరు, ఫిబ్రవరి 4 (ఆంధ్రజ్యోతి): కొవిడ్ రెండో వేవ్ సమయంలో సంభవించిన అపార ప్రాణ నష్టం కన్నీళ్లు తెప్పించిందని మాజీ ముఖ్యమంత్రి బీఎస్ యడియూరప్ప పేర్కొన్నారు. కర్ణాటక వర్కింగ్ జర్నలిస్టుల సంఘం ఆధ్వర్యంలో నగరంలోని గాంధీ భవన్‌లో శుక్రవారం ఆయన సంఘం అధ్యక్షుడు శివానంద తగడూరు రాసిన 'కొవిడ్ కథలు' పుస్తకాన్ని ఆవిష్కరించారు. కొవిడ్ మరణమృదంగం వేల కుటుంబాల్లో విషాదం నింపిందని, ఆ సమయంలో ప్రభుత్వం ఎంతో ధైర్యంగా పరిస్థితిని నిభాయించిందని చెప్పారు. కరోనా వైరస్ ఇంకా పూర్తిగా సమసిపోలేదని ప్రజలు సదా అప్రమత్తంగా ఉండాలని ఆయన హెచ్చరించారు. కార్యక్రమంలో ప్రముఖ పాత్రికేయులు విజయవాణి సంపాదకులు కేఎన్ చెన్నేగౌడ, కన్నడ ప్రభ సంపాదకుడు రవి హెగ్డే, మీడియా అకాడమీ చైర్మన్ సదాశివ శెణై, విశ్వవాణి సంపాదకుడు విశ్వేశ్వరభట్, కర్ణాటక గాంధీ స్మారక ట్రస్టు చైర్మన్ వూడే పి.కృష్ణ, మాజీ అధికారి హెచ్.బి.దినేష్ తదితరులు పాల్గొన్నారు. కొవిడ్ సమయంలో మాజీ సిఎం యడియూరప్ప చేపట్టిన పలు సంక్షేమ పథకాలను ఈ సమావేశంలో వక్తలు వేనోళ్ల కొనియాడారు.



పుస్తకావిష్కరణలో మాజీ ముఖ్యమంత్రి యడియూరప్ప, తదితరులు

ఈనాడు సోమవారం డిసెంబరు 13, 2021

# కన్నడ పాఠశాలల్ని కాపాడుకుందాం

**బెంగళూరు (మల్లేశ్వరం), న్యూస్‌టుడే:** కన్నడ మాధ్యమ పాఠశాలల్ని కాపాడుకునేందుకు ముందుకు రావాలని కన్నడ నుడి సమ్మేళనాల అధ్యక్షుడు, సాహితీవేత్త పాలనేత్ర పిలుపునిచ్చారు. 'ఎక్కడున్నా..ఎలా ఉన్నా..కన్నడిగునిగా ఉండు' అని పేర్కొన్న కువెంపు మాటల్ని విస్మరించవద్దని కోరారు. కన్నడ పాఠశాలల్ని కొనసాగిస్తూ, కన్నడ భాష, హద్దులు, జలం కోసం పోరాటం చేసిన వారిపై కేసులు తొలగించాలని పోరాటానికి ప్రతి ఒక్కరూ కలిసి రావాలని కోరారు. నయన ఆడిటోరియంలో అఖిల కర్ణాటక కువెంపు సాంస్కృతిక వేదికె ఆదివారం నిర్వహించిన కార్యక్రమంలో కన్నడ భాష, సాహిత్యానికి సేవలందిస్తున్న వారిని సత్కరించి మాట్లాడారు. ఉద్యాననగరిలో ఇమ్మడి పులకేశి విగ్రహం ఏర్పాటు, మాజీ ముఖ్యమంత్రి నిజలింగప్ప పేరిట అధ్యయన పీఠం, రాష్ట్రకవి కువెంపు సమగ్ర సాహిత్యాన్ని అధ్యయనం చేసేందుకు చర్యలు తీసుకోవాలని తాము ప్రభుత్వాన్ని కోరుతున్నట్లు చెప్పారు. విదేశీ భాషలు నేర్చుకోవాలని కోరుకుంటున్న నేటి యువత కన్నడ భాషను విస్మరిస్తున్నారని ఆక్రోశించారు. వివిధ రంగాలకు చెందిన సురేశ్, మాయప్ప, గీత, శివకుమార్ బెళ్లితట్టె, మోహన్‌కుమార్, రామాంజిని, సత్యనారాయణ తదితరులను వేదికె ప్రతినిధులు ఘనంగా సత్కరించారు. ఈ కార్యక్రమంలో వివిధ రంగాల ప్రతినిధులు ఆచార్య మల్లేపురం వెంకటేశ్, వోడె కృష్ణ, సురేశ్ జీవన్ముఖి తదితరులు పాల్గొన్నారు.



సత్కారం పొందినవారితో పాలనేత్ర, ఇతర అతిథులు

# 5జి సాంకేతికతతో మానసిక స్థితిలో కుంగుబాటు

బెంగళూరు (యశ్వంతపుర), న్యూస్‌టుడే: యువత 5జి సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించడం వల్ల మానసిక, శారీరక శక్తి కుంగిపోతుందని మైసూరు రామకృష్ణ ఆశ్రమం స్వామి శాంతివ్రతానంద ఆందోళన వ్యక్తం చేశారు. బాపు-150వ జయంతి సందర్భంగా గాంధీభవన్‌లో ఏర్పాటు చేసిన సర్వోదయ దినోత్సవ కార్యక్రమంలో ఆయన పాల్గొన్నారు. ఈసందర్భంగా ఆయన మాట్లాడుతూ 5జీ సాంకేతిక పరిజ్ఞానం నుంచి యువత బయటపడాల్సిన అవసరం ఉందని తెలిపారు. మహాత్మాగాంధీ తక్కువ దుస్తులు ధరించి దేశవ్యాప్తంగా పర్యటించి యువతలో సామాజిక సామర్థ్యాన్ని పెంచి పోషించారని తెలియజేశారు.

గాంధీ సిద్ధాంతాలపై మూడు గ్రంథాలు వెలువడ్డాయని, వాటిని యువత అధ్యయనం చేసి గాంధీ తత్వాలను తమ జీవితంలో అలవర్చుకోవాలని సూచించారు. గాంధేయవాదులు డాక్టర్ జగదీష్ కూప్ప, శంకర్ ఉత్తూర, పాటిల్‌పుట్టప్ప, చెన్నమ్మ హళ్లికేరి తదితరులను సత్కారించారు. కార్యక్రమంలో కర్ణాటక గాంధీ స్మారక అధ్యక్షుడు వూడే పి. కృష్ణ తదితరులు పాల్గొన్నారు.



బాపు వర్ధంతిని పురస్కరించుకుని సత్కారాన్ని అందుకున్న గాంధేయవాదులు




దీపం వెలిగించి కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న ఉపముఖ్యమంత్రి డాక్టర్ అశ్వర్థనారాయణ, గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు వూడే కృష్ణ తదితరులు

# సామాజిక సేవలో పాలుపంచుకోవాలి

బెంగళూరు(యశ్వంతపుర), న్యూస్‌టుడే: ఉన్నత విద్య చదువుతున్న విద్యార్థులు సామాజిక సేవా కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనాలని ఉపము ఖ్యమంత్రి డాక్టర్ అశ్వర్థనారాయణ పిలుపునిచ్చారు. శనివారం ఇక్కడ కొండజ్జి బసప్ప సమావేశ మందిరంలో క్యాంపస్ టు కమ్యూనిటీ ఏర్పాటు చేసిన స్కూల్ బెల్ కార్యక్రమాన్ని ఆయన ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఉన్నత విద్య కోర్సుల్లో ప్రయోగాత్మక పరీక్షలు తక్కువ. దీని వల్ల అనుభవం తగ్గుతుంది. విద్యార్థులు సామాజిక కార్యక్రమాల్లో పాల్గొంటే మంచిదని సూచించారు. విశ్వవిద్యాలయాల్లో ప్రయోగ పరీక్షలు ఎక్కువ ఉండాలని అభిప్రాయపడ్డారు. జాతీయ విద్యావిధానంలో సంస్కృతి, క్రీడలు, ఆధ్యాత్మిక తదితర అంశాలు చేర్చారని గుర్తుచేశారు. చదువంటే కేవలం పుస్తకాలు చదవడం కాదని, సామాజిక కార్యక్రమాల్లో విద్యార్థులు భాగస్వామ్యం కావల్సిన అవసరం ఉందని తెలిపారు. కార్యక్రమంలో గాంధీ స్మారకనిధి అధ్యక్షుడు వూడే కృష్ణ, రచయిత డాక్టర్ వసంతకుమార్, ఎన్ఎస్ఎస్ రాష్ట్ర అధికారి డాక్టర్ రంగనాథ్ తదితరులు పాల్గొన్నారు.

# జిల్లా కేంద్రాల్లో గాంధీ భవనాలు!

బెంగళూరు (మల్లేశ్వరం), న్యూస్ టుడే : వచ్చే ఏడాదిన్నరలో అన్ని జిల్లా కేంద్రాల్లో గాంధీభవన్‌ల నిర్మాణాలను పూర్తి చేస్తామని ముఖ్యమంత్రి యడియూరప్ప ప్రకటించారు. బళ్లారి, మడికేరి, చిక్కబళ్లాపుర జిల్లాల్లో నిర్మాణాలు పూర్తయినట్లు వివరించారు. ఈ భవనాలకు రూ.20 లక్షలు చొప్పున అదనంగా సమకూరుస్తామన్నారు. మరో 25 జిల్లాల్లో నిర్మాణ దశలో ఉన్న భవంతుల కోసం ఒక్కోదానికి రూ.3 కోట్లు చొప్పున రూ.75 కోట్లు విడుదల చేశామని చెప్పారు. మహాత్ముని 150వ జయంతి ఉత్సవాల ఆచరణలో భాగంగా గాంధీభవన్‌లో సమాచార శాఖ ఏర్పాటు చేసిన ఛాయాచిత్ర ప్రదర్శనను బుధవారం యడియూరప్ప ఆవిష్కరించారు. చామరాజనగరలోని దీనబంధు మక్కళమనె ప్రతినిధి జి.ఎస్.జయదేవ, చిక్కబళ్లాపురకు చెందిన స్వాతంత్ర్య పోరాట యోధుడు సు.రం.రామయ్యలను సత్కరించి మాట్లాడారు. మహాత్ముడిని ప్రతి ఒక్కరికీ చేరువ చేసే దిశలో ప్రభుత్వం చర్యలు తీసుకుంటోందని హామీ ఇచ్చారు. ప్రత్యేకంగా రూపొందించిన తపాలా కవర్‌ను ఇదే సందర్భంగా ఆవిష్కరించారు. కార్యక్రమంలో మాజీ మంత్రి హెచ్.కె.పాటిల్, కర్ణాటక గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు వోడె పి.కృష్ణ, గాంధీ సేవా పురస్కార గ్రహీత ప్రసన్న హెగ్గోడు, తపాలాశాఖ అధికారి డాక్టర్ చార్లెస్ లోబో, పీఐబీ అధికారి ఎం.నాగేంద్రస్వామి పాల్గొన్నారు.



గాంధీ స్మారక పురస్కారాలను జయదేవ, సు.రం.రామయ్యకు అందించిన ముఖ్యమంత్రి యడియూరప్ప తదితరులు

ఈనాడు మంగళవారం సెప్టెంబరు 24, 2019

# బాపూ జయంత్యుత్సవాలు ప్రారంభం

**బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే:** మహాత్ముని 150వ జయంతి ఉత్సవాల్లో భాగంగా గాంధీభవన్‌లో సోమవారం నిర్వహించిన కార్యక్రమాన్ని క్రీడా శాఖ అదనపు ముఖ్య కార్యదర్శి డా. జి. కల్పన ప్రారంభించారు. మహాత్ముని జయంతి ఉత్సవాల్లో భాగంగా అన్ని జిల్లా కేంద్రాల్లో ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహిస్తామని ఆమె తెలిపారు. గాంధీభవన్‌లో నిర్వహించిన కార్యక్రమంలో రాజీవ్‌గాంధీ ఆరోగ్య వైద్య విశ్వ విద్యాలయం ఉప కులపతి డా. ఎస్. సచ్చిదానంద, గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు డా. వోవె పి. కృష్ణ తదితరులు పాల్గొన్నారు.



మహాత్ముని విగ్రహానికి పుష్పార్చన

ఈనాడు ఆదివారం సెప్టెంబరు 15, 2019

# భావోద్వేగాలను ప్రేరేపించేవే నాటకాలు

బెంగళూరు (మల్లేశ్వరం), న్యూస్‌టుడే: మనిషిలో, సమాజంలో మార్పులు తీసుకు వచ్చే నాటకాలకు ఇప్పటికీ ఆదరణ ఉందని జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా. చంద్రశేఖర కంబార అన్నారు. అలనాటి నాటకాలు మనిషిలో భావోద్వేగాలను ప్రేరేపించేవని గుర్తు చేసుకున్నారు. శేషాద్రిపురం కళాశాలలో ఏర్పాటు చేసిన 'కన్నడ నాటకాలు-పునర్విమర్శ' అనే సాహిత్య గోష్ఠిని ప్రారంభించి మాట్లాడారు. గత కాలపు పరిస్థితులను మన కళ్ల ముందు సాక్షాత్కరించేలా నాటకాలను రచించే రచయితల సంఖ్య తగ్గిపోయిందని ఆవేదన వ్యక్తం చేశారు. నాటకాన్ని వీక్షించే వారు తమ హోదా, వయసు, స్థాయిలను మరచిపోయి వాటిని చూడాలని సూచించారు. భాషపై మక్కువ పెంచుకుంటే, మనం ఎక్కువ రసాస్వాదన చేసేందుకు అవకాశం ఉంటుందని తెలిపారు. కనీసం ఏడో తరగతి వరకు అయినా ప్రతి ఒక్కరూ మాతృభాషలోనే విద్యాభ్యాసం చేసేలా చట్టాన్ని తీసుకు వస్తేనే భాషలను కాపాడుకునేందుకు అవకాశం ఉంటుందని వివరించారు. ఈ కార్యక్రమంలో శేషాద్రిపురం శిక్షణ ట్రస్టు గౌరవ ప్రధాన కార్యదర్శి వోడె పి.కృష్ణ, నట, దర్శకుడు హొసహళ్లి దాళేగౌడ, ఆచార్యుడు డా. కె.పి.నటరాజ్ తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా కంబారను ఘనంగా సత్కరించారు.



కంబారను సత్కరిస్తున్న వోడె.పి.కృష్ణ

ఆంధ్రజ్యోతి
05 సెప్టెంబరు 2019

# ఇంజనీరింగ్ కళాశాలల అభివృద్ధికి సహకారం

## - భారతీయ సైన్స్ కాంగ్రెస్ సదస్సులో డీసీఎం అశ్వత్థనారాయణ

బెంగళూరు, సెప్టెంబరు 4 (ఆంధ్రజ్యోతి): ఇంజనీరింగ్ కళాశాలలో సాంకేతిక పరిజ్ఞానం పెంపొందించే దిశగా అవసరమైన సౌలభ్యాలు సమకూర్చేందుకు ప్రభుత్వం బాధ్యత వహిస్తుందని ఉపము ఖ్యమంత్రి డా.అశ్వత్థనారాయణ అభిప్రాయప డ్డారు. నిమ్హాన్స్ కన్వెన్షన్ సెంటర్‌లో బుధవారం భారతీయ సైన్స్ కాంగ్రెస్ సదస్సును లాంఛ నంగా ప్రారంభించారు.

ఇజ్రాయెల్ జాతీయ పరిషత్ సహ వ్యవస్థాపకుడు షైన్ ఇషద్, ఎన్ఆర్ఎఐ సీఏఓ డా.అశోక్ దళవాయ్, సీబీపీఓ డా.వెం కట క్రిష్ణన్, ప్రొ.ఆర్.ఎం.వాసగంలు పాల్గొన్నా రు. డీసీఎం మాట్లాడుతూ ఇంజనీరింగ్ కళా శాలల అభివృద్ధికి సంపూర్ణంగా సహకరి స్తామన్నారు. అ వసరమైన గ్రాంట్లతో పాటు మౌలిక సదు పా యాలు, బోధన, బోధనే తర సిబ్బంది వంటి అంశాలలో ప్రాధాన్యత కల్పిస్తామన్నారు. దేశంలోని అన్ని ఇంజనీరింగ్ కళాశాలలు 75 శాటిలైట్‌లను సిద్ధం చేయడం సాంకేతిక పరిశోధనలవైపు విద్యార్థులు వెడుతున్నార నేందుకు ఓ ఉదాహరణ అన్నా రు. ఇజ్రాయెల్‌లో ప్రాథమిక విద్యనుంచే ఉపగ్ర హాలకు సం బంధించిన బోధనలు ఉంటాయనే అంశాన్ని కొనియాడారు.



సదస్సులో డిఆర్‌డిఓ లక్ష్య నమూనాతో డీసీఎం అశ్వత్థనారాయణ

# కళాశాలలు శాస్త్రవిజ్ఞాన కేంద్రాలుగా మారాలి

**బెంగళూరు(యశ్వంతపుర), న్యూస్‌టుడే:** ఇంజినీరింగ్ కళాశాలలు సాంకేతిక పరిజ్ఞాన కేంద్రాలుగా మారాల్సిన అవసరం ఉందని ఉపముఖ్యమంత్రి డాక్టర్ అశ్వర్థనారాయణ తెలిపారు. బుధవారం నగరంలోని నిమ్హాన్స్ సమావేశమందిరంలో ఏర్పాటు చేసిన 7వ భారతీయ సాంకేతిక కాంగ్రెస్ సమావేశాన్ని ఆయన ప్రారంభించి, మాట్లాడారు. దేశంలోని అన్ని ఇంజినీరింగ్ కళాశాలలు సాంకేతిక పరిజ్ఞాన కార్యకలాపాలకు నిలయాలుగా మారాలన్నారు. దీనివల్ల దేశం సాంకేతిక రంగంలో అగ్ర దేశాలకు పోటీ ఇచ్చేందుకు అవకాశం కలుగుతుందన్నారు. ఇంజినీరింగ్ కళాశాలలకు అవసరమైన మౌలిక సౌకర్యాలు, బోధన సిబ్బంది తదితరాలను కల్పించేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉన్నట్లు తెలిపారు. ఇజ్రాయిల్‌లో ప్రాథమిక, ఉన్నత విద్య స్థాయిలో విద్యార్థులకు ఉపగ్రహాలపై అవగాహన కల్పిస్తారని, ఆ దేశ విద్యార్థులు తమదైన శైలిలో ఉపగ్రహాలను తయారు చేస్తున్నారని గుర్తు చేశారు. ఇజ్రాయిల్ తరహాలో దేశంలో సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశపెట్టాల్సిన అవసరం ఉందని అభిప్రాయపడ్డారు. బెంగళూరు నగరం ప్రస్తుతం సాంకేతిక పరిజ్ఞాన కేంద్రంగా మారినట్లు చెప్పారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశంలో ఆహార ధాన్యాల కొరత ఉండేదని, వ్యవసాయ విప్లవం ప్రారంభమైన తరువాత ఆహార ధాన్యాల కొరత తీరిందన్నారు. ఈసందర్భంగా వివిధ రంగాల్లో ప్రతిభ కనపరిచిన వ్యక్తుల్ని ఆయన సన్మానించారు. కార్యక్రమంలో ఇజ్రాయిల్ జాతీయ పరిషత్తు సహాయక వ్యవస్థాపరాలు ఆచార్య చ్యేమ్ ఇషద్, సీఈఓ డాక్టర్ అశోక్ దాలవాయి, డాక్టర్ వెంకట కృష్ణన్, ఆచార్య ఆర్.ఎం.వాసగాం తదితరులు పాల్గొన్నారు.



**కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న డాక్టర్ అశ్వర్థనారాయణ తదితరులు**

ఆంధ్రజ్యోతి 13-8-2007

HINDU 13-8-2007

# విలువలను అర్థం చేసుకోండి

## హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సిరియాక్ జోసెఫ్




నగరంలో ఆదివారం రెడ్ క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో జరిగిన జెనివా సదస్సు దినోత్సవాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తున్న హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సిరియాక్ జోసెఫ్

బెంగళూరు, ఆగస్టు 12 (ఆన్‌లైన్ ప్రతినిధి): జెనివా ఒప్పందం విలువలను ఆకళింపు చేసుకుని ప్రతి ఒక్కరూ సేవా మనోభావాన్ని పెంచుకోవాలని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సిరియాక్ జోసెఫ్ పిలుపు నిచ్చారు. ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో ఆదివారం ఏర్పాటైన జెనివా సదస్సు దినోత్సవాన్ని ఉద్దేశించి ఆయన ప్రసంగించారు. జెనివా ఒప్పందంలోని అన్ని అంశాలు సేవా మనోభావాలను పెంచేవిగానూ, అంతర్జాతీయ స్థాయిలో సోదరభ్రాతృత్వాన్ని ఇనుమడించేవిగానూ ఉన్నాయని జోసెఫ్ పేర్కొన్నారు. నేటి యువతరంలో రానురాను విలువలు అదృశ్యమవుతుండటం పట్ల ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. సేవా దృక్పథాన్ని పెంచుకునే దిశలో మనమంతా ముందుకు సాగాల్సి ఉందన్నారు. సినిమా,. టీవీ మీడియా ప్రభావం కారణంగా ఇందులో చోటుచేసుకునే విషయాలను అనుసరించాలని ఆరాటపడుతున్న వారి కారణంగా కొత్త రకం సమస్యలు వచ్చిపడుతున్నాయని ఇది అత్యంతర విచారకరమని ఆయన అన్నారు. పెద్దలు ఈ విపరీత పోకడకు ఫుల్‌స్టాప్ పెట్టాల్సిన అవసరం ఉందన్నారు. సమాజంలో అవినీతి విలయతాండవం చేయడానికి స్వార్థమే కారణమని అన్నారు. సమాజంలో ఉత్తమ వ్యక్తిత్వాన్ని, సేవా మనోభావాన్ని ప్రతి ఒక్కరూ అలవర్చుకోవాలని ఆయన కోరారు. ఈ కార్యక్రమంలో రెడ్ క్రాస్ సొసైటీ కర్ణాటక శాఖ ఉపాధ్యక్షుడు కృష్ణ, గౌరవ కోశాధికారి రాజు చంద్రశేఖర్, ప్రధాన కార్యదర్శి డా. ఎన్.జి.నారాయణ తదితరులు పాల్గొన్నారు.

# Geneva Convention Day celebrations

Staff Reporter

BANGALORE: "One hundred and thirty five nations gathered in 1949 and signed the Geneva Convention giving an international dimension to humanism," said Cyriac Joseph, Karnataka High Court Chief Justice, here on Sunday. He was speaking after inaugurating the Geneva Convention Day organised by the Karnataka branch of the Indian Red Cross Society.

Mr. Cyriac Joseph hailed the neutrality of the Red Cross movement and paid encomiums to Red Cross volunteers for their spirit of service and sacrifice.

At the function organised to commemorate the 58th anniversary of this event, Wooday P. Krishna, vice-chairman of the State branch of the society, called upon the volunteers of Red Cross to contribute towards disseminating information regarding the misuse of the Red Cross emblem.

13-8-2007

# యువతను సన్మార్గంలో పెట్టాలి

## ప్రధాన న్యాయమూర్తి సిరియాక్ జోసెఫ్




సదస్సులో ప్రసంగిస్తున్న రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సిరియాక్ జోసెఫ్

బెంగుళూరు, ఆగస్టు 12, ప్రభాతవార్త

విద్యార్థులు, యువతలో చట్ట వ్యతిరేక కార్యకలాపాలు పెచ్చు పెరుగుతుండడంపట్ల రాష్ట్రహైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సిరియాక్ జోసెఫ్ ఆందోళన వ్యక్తం చేశారు. ఇదే విధమైన పరిస్థితి కొనసాగితే భవిష్యత్తులో యువత మరింత పెడదారి పట్టి తద్వారా సమాజానికి కీడుగా పరిణమించే ప్రమాదం ఉన్నందున న్యాయసేవా ప్రాధికార యువతలో చట్టాల గురించి జాగరూకత కలించే ప్రయ త్నం చేయాలని పిలుపునిచ్చారు. రాష్ట్ర హైకోర్టు సభాంగణలో ఆదివారం జరిగిన న్యాయసేవల ప్రాధికార ఏడవ వార్షికోత్సవాన్ని ఆయన ప్రారంభించి ప్రసంగించారు. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో 25 శాతం మంది యువకులు మద్యపానానికి బానిసలైనట్లు ఉన్నత విద్యాశాఖ మంత్రి డి.హెచ్.శంకర మూర్తి వ్యాఖ్యలను ప్రస్తావిస్తూ ఉత్తమ సమాజ నిర్మాణం విద్యార్థులు, యువతపై ఆధారపడి ఉందని, వారే మద్యానికి బానిసలై చట్ట వ్యతిరేక కార్యకలాపాలకు పూనుకోవడం ఆందోళన కలిగించే అంశమన్నారు. ఏమాత్రం ఆలస్యంగా చేయకుండా పెడదారి పడుతున్న యువతను సన్మార్గంలో పెట్టే ప్రయత్నం అన్ని వైపుల నుండి మొదలు కావాలన్నారు. అదే విధంగా సమాజంలో పెరుగుతున్న అవినీతిపై కూడా ఆయన కలవరం వ్యక్తం చేశారు. వేళ్లూనుకున్న ఈ అవినీతిని నిర్మూలించడం అంత తేలికైన విషయం కాదు కాబట్టి, అవినీతిని ప్రోత్సహించే వారిలోనే పరివర్తన తీసుకు రావడం ఉత్తమమన్నారు. లంచం ఇచ్చే వారున్నంత వరకు తీసుకునేవారు ఉండనే ఉంటారని, లంచగొండితనాన్ని రూపుమాపాలంటే సమాజంలోనే పరివర్తన రావాలన్నారు. అవినీతి పరుల్లో పురుషులే కాకుండా మహిళలు ఉన్నారని, బాంగ్లాదేశ్ అధ్యక్షురాలు షేక్‌హసీనా అవినీతి కేసులో చిక్కుకున్న విషయాన్ని ఆయన గుర్తు చేశారు. పురుషుడి విజయం వెనుక మహిళ ఉన్నట్లు అవినీతి వెనుక కూడా మహిళ ఉంటుందన్నారు. సాంప్రదాయాలను పక్కన బెట్టి నవ నాగరికత పేరుతో అనవసర ఖర్చులు పెట్టడం కూడా ఈ అవినీతి పెచ్చుపెరగడానికి కారణంగా చెప్పారు. నేడు ఎంతో మంది కనీస సదుపాయాలు లేక అవస్థలు పడుతున్నారని, మనం విలాసవంతాలకు ఖర్చు పెట్టే ముందు వారి గురించి ఒక సారి ఆలోచించుకుంటే మంచిదన్నారు.



స్వాతంత్ర్యోత్సవ వేడుకల కోసం పెరేడ్ గ్రౌండ్‌లో రిహార్సల్స్ చేస్తున్న వివిధ పాఠశాలలకు చెందిన విద్యార్థులు

ఈనాడు

బుధవారం ఆగస్టు 7, 2019

**బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే:** ప్రముఖులు చెప్పిన జీవిత సత్యాలను అర్థం చేసుకుని, ఆచరించినప్పుడే జీవితం సార్థకమవుతుందని విజయనగరలోని పతంజలి యోగాశ్రమ అధ్యక్షుడు ప్రకాశ్ యోగి గురూజీ తెలిపారు. చెడు అలవాట్లతో ఆరోగ్యాన్ని పాడు చేసుకుని, ఔషధాలు తీసుకుంటే ప్రయోజనం ఉండదన్నారు. ప్రజాస్వామ్య వ్యవస్థలోని గొప్పతనాన్ని అర్థం చేసుకోకుండా, వ్యాఖ్యలు చేయడం తగదన్నారు. గాంధేయవాది మహాదేవి 14వ వర్థంతి పురస్కరించుకుని గాంధీభవన్‌లో మంగళవారం నిర్వహించిన చర్చాగోష్ఠిలో ఆయన పాల్గొన్నారు. గాంధీభవన్‌లో కొత్తగా నిర్మించిన మినీ ఆడిటోరియాన్ని ప్రారంభించి మాట్లాడారు. ఉపాధి, సంపాదన, కుటుంబం అంటూ ఆరాటపడేవారు జీవన చరమాంకంలో ఆరోగ్య సమస్యలు, మానసిక వ్యధతో బాధపడుతుంటారని తెలిపారు. పరోపకారం, ఆత్మవిమర్శ, అజయాలకు కుంగిపోకుండా నిలకడగా ఉండడం నేర్చుకోవాలని సూచించారు. కార్యక్రమంలో కర్ణాటక గాంధీ స్మారక నిధి, రామకృష్ణ హెగ్డే జాతీయ చింతనా వేదిక, గాంధీ అధ్యయన కేంద్రం, వల్లభ నికేతన, శేషాద్రిపురం సాయంత్రం కళాశాల ప్రతినిధులు వోడే పి.కృష్ణ, ఎం.పి. నాడగౌడ, మైకేల్ ఫెర్నాండెజ్, సవితా భట్, ఇందిరా కృష్ణప్ప తదితరులు పాల్గొన్నారు.



మహాత్ముడు, మహాదేవి చిత్రపటాలకు నివాళి

ఆంధ్రజ్యోతి

### శేషాద్రిపురం కళాశాలలో

# ప్రతిభా పురస్కారాలు



జ్యోతి ప్రజ్వలన చేస్తున్న జపానందస్వామి, తదితరులు

**బెంగళూరు, జూన్ 28 (ఆంధ్రజ్యోతి ప్రతినిధి):** బెంగళూరులోని శేషాద్రిపురం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కామర్స్ అండ్ మేనేజిమెంట్, శేషాద్రిపురం సంయుక్త పీయూ కళాశాల, శేషాద్రిపురం పీయూ కళాశాల విద్యార్థులకు 2019 సంవత్సరానికి గాను ప్రతిభా పురస్కారాలను ప్రదానం చేశారు. చౌడయ్య స్మారక భవనంలో జరిగిన ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా రామకృష్ణ సేవాశ్రమకు చెందిన స్వామి జపానంద హాజరయ్యారు. ఈ సందర్భంగా ప్రసంగిస్తూ విద్యాదానం సమాజ ప్రగతికి ఎంతగానో దోహదపడుతుందన్నారు. ఉన్నత విద్యతో ఉపాధి అందుకున్న అనంతరం ప్రతిభా పురస్కారాలకు ప్రస్తుత విద్యార్థులు కూడా చేయూతను అందించాలని పిలుపునిచ్చారు. 2019 సంవత్సరానికి గాను శేషాద్రిపురం గ్రూప్ విద్యాసంస్థల ఆధ్వర్యంలో రూ.7లక్షల మేరకు స్కాలర్‌షిప్‌లను అందచేశారు. పీయూసీ, ఎస్‌ఎస్‌ఎల్‌సిలో ర్యాంకులు పొందిన విద్యార్థులను కూడా వేదికపై ఘనంగా సన్మానించారు. ప్రస్తుత ఏడాది తమ సంస్థ మొత్తం రూ.1.5 కోట్ల మేరకు విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లను అందచేసిందని సంస్థ గౌరవ ప్రధాన కార్యదర్శి డా.ఊడే పి.కృష్ణ వెల్లడించారు. గ్రూప్ ఛైర్మన్ ఎన్.ఆర్.పండితారాధ్య కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా సంస్థ ఉపాధ్యక్షుడు టి.ఎస్.హెంజారప్ప, గౌరవ కార్యదర్శి ఎం.ఎస్.నటరాజ్, ట్రస్టీలు బి.సి.లోకనాథ్, జి.పరమశివయ్య, మాజీ ప్రిన్సిపాల్ ఎన్.ఆర్.సంతానం, ప్రిన్సిపాల్ జి.కె.మంజునాథ్, వైస్ ప్రిన్సిపాల్ ఆర్.కె.మంజునాథ్‌లు పాల్గొన్నారు. కాగా శేషాద్రిపురం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కామర్స్ మేనేజిమెంట్ సంస్థలో జరిగిన ప్రత్యేక కార్యక్రమానికి జైన్ యూనివర్శిటీ వైస్‌ఛాన్సెలర్ డా.ఎన్.సుందర్‌రాజన్ ముఖ్య అతిథిగా హాజరయ్యారు. శేషాద్రిపురం పీయూ కాలేజీలో జరిగిన కార్యక్రమానికి ముఖ్య అతిథిగా డాక్టర్ గీతారామానుజం హాజరయ్యారు.

సాక్షి

# ప్రతిభావంతులను ప్రోత్సహించాలి

యశవంతపుర: చదువుల్లో రాణిస్తున్నవారిని ప్రోత్సహించాలని సీనియర్ సాహితీవేత్త డాక్టర్ దొడ్డరంగేగౌడ ఉపాధ్యాయులకు సూచించారు. కెంగేరి శేషాద్రిపురం పీయూ కాలేజీ అవరణంలో శనివారం ఏర్పాటు చేసిన ప్రతిభా పురస్కార ప్రదానోత్సవంలో ఆయన పాల్గొని మాట్లాడారు. అనుకున్నది సాధించాలంటే కఠిన శ్రమ అవసరమన్నారు. విద్యార్థులు పెద్దలు, గురువులకు గౌరవం ఇవ్వాలన్నారు. అనంతరం టెస్ట్‌లో ఉత్తమమార్కులు సాధించిన విద్యార్థులకు శేషాద్రిపురం కాలేజీ కార్యదర్శి డాక్టర్ వూడో పి. కృష్ణ పురస్కారాలు ప్రదానం చేశారు. శిక్షణ దత్తి అధ్యక్షుడు ఎన్ఆర్ పండితారాధ్య, ఎంస్ నటరాజ్, అశోక్, రాధాకష్ణ, జయరామ్ తదితరలు పాల్గొన్నారు.


కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న దొడ్డరంగేగౌడ తదితరలు

ఆంధ్రజ్యోతి

కర్ణాటక ● మంగళవారం 21 మే 2019



# బీజేపీ, ఆర్ఎస్ఎస్‌లు సమాజానికి పెను ప్రమాదం

- స్వాతంత్ర్య సమరయోధుడు దొరస్వామి

బెంగళూరు, మే 20 (ఆంధ్రజ్యోతి): జాతిపిత మహాత్మాగాంధీ నెపంతో బీజేపీ, ఆర్ఎస్ఎస్‌లు సమాజంలో విషాన్ని నింపుతున్నాయని ఇవి రెండూ పెను ప్రమాదమైనవని స్వాతంత్ర్య సమరయోధుడు దొరస్వామి మండిపడ్డారు. సోమవారం నగరంలోని గాంధీభవన్‌లో కర్ణాటక గాంధీ స్మారకనిధి ఏర్పాటు చేసిన సబ్ కో సన్మతి దే భగవాన్ మౌన సత్యాగ్రహాన్ని ఉద్దేశించి మాట్లాడారు. ఈ సందర్భంగా దొరస్వామి మాట్లాడుతూ నాథూరాం గాడ్సే కేవలం మహాత్మాగాంధీని మాత్రమే కాకుండా సత్యాన్ని హత్యచేశారన్నారు. కొందరు తప్పును సమర్థించుకుంటున్నారని బీజేపీ, ఆర్ఎస్ఎస్‌ల తీరు విచారకరమన్నారు. గాడ్సే పుస్తకంలో గాంధీ, ముస్లింల పరంగా ఉన్నారనే హత్యచేసినట్లు ప్రస్తావించారని ఇందులో వాస్తవం లేదన్నారు. ఎవరూ చరిత్రను మార్పు చేయలేరన్నారు. ప్రధాని నరేంద్రమోదీ దేశ చరిత్ర పూర్తిగా చదవలేదని అంతటి జ్ఞానం కూడా లేదని గాంధీ పట్ల తప్పుడు సమచారం ఇస్తున్నారని విచారం వ్యక్తం చేశారు. రంగస్థల నటుడు ప్రసన్న హెగ్గోడు డా.ఊడే పి.కృష్ణ, ఇందిరా క్రిష్ణప్ప, మాజీ అడ్వకేట్ జనరల్ ప్రొ.రవివ ర్మకుమార్, సాహితీవేత్త డా.భైరమంగల రామేగౌడ, జలనిపుణుడు రాజేంద్రతోపాటు పలువురు పాల్గొన్నారు.



# మహాత్మా మన్నించు

సత్యం, అహింస అనే ఆయుధాలతో దేశానికి స్వాతంత్ర్యం తీసుకువచ్చి, బ్రిటిష్ పాలనకు చరమగీతం పాడిన మహనీయుడు మహాత్మా గాంధీపై సోషల్ మీడియాలో అనుచిత వ్యాఖ్యలు రావడాన్ని వ్యతిరేకిస్తూ సోమవారం ఇక్కడి గాంధీభవన్‌లోని మహాత్ముడి విగ్రహం ఎదుట మౌన నిరసనలో కూర్చున్న స్వాతంత్ర్య సమరయోధుడు దొరైస్వామి, సంఘ సేవకులు ప్రసన్న హెగ్గోడు, విష్ణుకుమార్, ప్రొఫెసర్ రవి వర్మ తదితరులు.

# మహాత్ముడికే అవమానం

## సమరయోధుడు దొరెస్వామి ధ్వజం



ఆందోళనలో పాల్గొన్న దొరెస్వామి, ప్రసన్న కుమార్ తదితరులు

**బెంగళూరు (మల్లేశ్వరం), న్యూస్ టుడే :** మహాత్ముడిని హత్య చేసిన నాథూరాం గాడ్సేని అడ్డు పెట్టుకుని భాజపా. సంఘ పరివార్ నాయకులు సమాజంలో చీలికలు తెచ్చేందుకు ప్రయత్నిస్తున్నారని స్వాతంత్ర్య పోరాట యోధుడు హెచ్.ఎస్.దొరెస్వామి ధ్వజమెత్తారు. ప్రజల మధ్య గొడవలు, సమాజంలో ఉద్రిక్తలకు కారణమయ్యే విష బీజాలు విత్తేవారి విషయంలో ప్రజలు జాగ్రత్త పడాలని హెచ్చరించారు. బెంగళూరు కుమార కృప రహదారి గాంధీభవన్‌లో సోమవారం 'సబ్‌కో సమ్మతి దే భగవాన్' పేరిట నిర్వహించిన మౌన ప్రదర్శనలో ఆయన పాల్గొన్నారు. ఈ సందర్భంగా విలేకరులతో ఆయన మాట్లాడారు. గాంధీని మాత్రమే కాకుండా సత్యాన్నీ గాడ్సే హత్య చేశాడని. ఎవరిని- ఎవరు హత్య చేసినా ఖండించాలని అన్నారు. తీవ్రవాదానికి, హంతకులకు కులం, మతాన్ని ఆపాదించకూడదని సూచించారు. 'మహాత్ముడు ముస్లింలకు మద్దతుగా ఉంటూ, ఇతర వర్గాలను కించపరచడంతోనే తాను ఆయన్ను హత్య చేశా'నని గాడ్సే పేరిట పుస్తకంలో ప్రచురించిన విషయాన్ని తాను విన్నానని చెప్పారు. అందులో సత్యం ఏమాత్రం లేదని, చరిత్రను తిరగరాయడం సరికాదన్నారు. 'ప్రతి విషయంలో మీ అభిప్రాయం, ఎదుటి వ్యక్తి అభిప్రాయం వేర్వేరుగా ఉన్నట్లే, అసలు- వాస్తవం వేరుగా ఉంటాయి' అని గుర్తు చేసుకోవాలన్నారు. తాను హిందుత్వవాదిని అని ప్రకటించుకునే వినాయక్ దామోదర్ సావర్కర్ బ్రిటీష్ వారి ముందు మోకరిల్లి, కాలాపానీ కారాగారం నుంచి బయటకు వచ్చారని, తెల్లదొరల తరపున కోవర్టుగా పని చేశారని విమర్శించారు. భగత్‌సింగ్, ఇతర వీరులకు ఉరి శిక్ష వేసినా ఆయన స్పందించలేదని గుర్తుచేశారు. ప్రధాని నరేంద్ర మోదీ దేశ చరిత్రను పూర్తిగా అధ్యయనం చేయలేదని, ఆయనకు సరైన విషయ పరిజ్ఞానం లేకపోవడంతోనే మహాత్ముడి గురించి తప్పు సమాచారాన్నే ప్రచారం చేసేందుకు ప్రయత్నిస్తున్నారని ఆరోపించారు. సీనియరు నాటకకారుడు ప్రసన్న, కర్ణాటక గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు డాక్టర్ వోడే పి.కృష్ణ, మాజీ అడ్వకేట్ జనరల్ ప్రొఫెసర్ రవి వర్మకుమార్, సాహితీవేత్త డాక్టర్ బైరమంగల రామేగౌడ, నీటి వనరుల సంరక్షణ నిపుణుడు రాజేంద్ర, గాంధీభవన్ గౌరవ కార్యదర్శి ఇందిరా కృష్ణప్ప తదితరులు పాల్గొన్నారు.

# మహాత్ముడి జయంతిపై గాంధేయవాదుల సమీక్ష

**బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే:** మహాత్ముడి 150వ జయంత్యుత్సవాలను పురస్కరించుకొని ఈ ఏడాది ఆగస్టు, సెప్టెంబరు నెలల్లో నగరంలో భారీ స్థాయి అంతర్జాతీయ సమావేశాన్ని నిర్వహించాలని గాంధీ స్మారక నిధి ప్రతినిధులు నిర్ణయించారు. సమావేశ నిర్వహణపై చర్చించేందుకు సీనియరు స్వాతంత్ర్య పోరాట యోధుడు హెస్. ఎస్. దొరెస్వామి, స్మారక నిధి "అధ్యక్షుడు వోడె పి. కృష్ణ," గాంధేయవాదులు కుమార్ ప్రశాంత్, అన్నామలై, శెణై సంఘ తదితరులు సోమవారం ఇక్కడ చర్చలు జరిపారు. సార్క్ దేశాల ప్రతినిధులను సమావేశానికి ఆహ్వానించడం, 15 మంది విదేశీ వక్తలు, పది మంది దేశీయ వక్తలతో ఉపన్యాసమాలిక, గాంధేయవాదమే సమస్యలకు పరిష్కరణ చూపిస్తుందా? తదితర అంశాలపై చర్చకు అంతర్జాతీయ సమావేశాన్ని నిర్వహించాలని ప్రాథమిక సభలో తీర్మానించారు. రానున్న రోజుల్లో దీనిపై మరోమారు సమావేశమవుతామని దొరెస్వామి తెలిపారు.



దొరెస్వామికి స్వాగతం పలుకుతున్న ప్రముఖులు

# అలరించిన సామూహిక గానం

**» రవీంద్రకళాక్షేత్ర వద్ద 1116మంది ఏకకంఠంతో గానం**



రవీంద్రకళాక్షేత్ర వద్ద సందడి ఇలా...

బెంగళూరు, అక్టోబరు 15 (ఆంధ్రజ్యోతి): ఏకకంఠం అనిపించేలా 1116 మంది సామూహిక గాయనంతో రవీంద్రకళాక్షేత్ర ప్రాంగణం సంగీతంతో వెల్లివిరిసింది. రంగసంస్థాన వ్యవస్థాపకుడు బిండ్లహళ్ళి విజయకుమార్ ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన సంగీత సామూహిక గాయనం కార్యక్రమాన్ని గాంధీ ప్రతిష్టాన ముఖ్యులు ఉడె పి కృష్ణ లాంఛనంగా ఆరంభించారు. మాజీ మేయర్ పద్మావతి అధ్యక్షత వహించారు. సాయంత్రం నంస రంగమందిరం ఎదుట 1116మంది మహిళలు ఒకేసారి భక్తిగేయాలను ఆలపించారు. ముఖ్యగాయకులు ప్రభా ఇనాందార్, నిరంజన్ హిరేమఠ్, అపర్ణ ప్రసన్న, చేతన్ రామ్, రక్షిత మేఘన, వర్షశ్రీ మరూరు కాగా కే బోర్డ్ వసంత్‌కుమార్ కుంబ్లె, తబలాపై మారుతి, రిథమ్‌ప్యాడ్‌పై ప్రసాద్, లయ వాద్యంపై శ్యామదత్‌లు సహకారం అందించారు. దత్త స్వరూపి నాగసాయి బాబా వీఏ నాగరాజ్, మాజీ డిప్యూటీ స్పీకర్ షట్టణ్ణతోపాటు రంగస్థల ప్రముఖులు శ్రీనివాస్ జీ కప్పణ్ణ, నటుడు మనోరంజన్ రవిచంద్రన్, వాసా సైంటిఫిక్ కంపెనీ చైర్మన్, వీబీ ప్రకాశ్, చంద్రకళ, గిరీశ్‌తోపాటు సంగీత అభిమానులు, కళాకారులు, వివిధ విద్యాసంస్థలు, సంఘాల ప్రతినిధులు భాగస్వాములయ్యారు. ఏక కాలంలో ఆధ్యాత్మికత గేయాలాపన సందర్భులను అలరింపచేశాయి. రంగసంస్థాన సంస్థ సామూహిక గాయనంలో ఇప్పటికే మూడుసార్లు లిమ్కా బుక్ ఆఫ్ నేషనల్ రికార్డును సాధించింది. 22ఏళ్లుగా రంగసంస్థాన సంస్థ సంగీతం, ఆధ్యాత్మిక పాటలతో ప్రత్యేక ఆకర్షణగా కార్యక్రమాలు నిర్వహిస్తోంది.

# ప్రగతికి దోహదపడే విద్య కావాలి



స్నాతకోత్సవంలో పట్టాలు, బంగారు పతకాలు అందుకున్న ప్రతిభావంత పట్టభద్రులు

బనశంకరి: దేశ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, సాంకేతికాభివృద్ధికి దోహదపడే విద్యను అందించటం అవసరమని గవర్నర్ థావర్‌చంద్ గెహ్లోట్ అన్నారు. సోమవారం నగరంలోని సెంట్రల్‌కాలేజీలో బెంగళూరు నగర యూనివర్సిటీ రెండవ స్నాతకోత్సవం ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ మానవ సమాజానికి వాతావరణ మార్పులతో ముప్పు తలెత్తిందని, దీంతో సరళమైన జీవనశైలిని అలవర్చుకోవాలని అన్నారు. నిరుపేదల సంక్షేమానికి ప్రాధాన్యత ఇవ్వాలని తెలిపారు. ప్రతిభావంత విద్యార్థులు ఆదర్శ సమాజం ఏర్పాటుకు మూలస్తంభాలన్నారు. ఈ సందర్భంగా పట్టభద్రులకు ఆయన పట్టాలను, పతకాలను బహూకరించారు. వృధా కృష్ణ, నిస్సార్ అహ్మద్ తారిణి చిదానందలకు గౌరవ డాక్టరేట్లను బహూకరించారు.

ఆంధ్రజ్యోతి మంగళవారం 11 జూలై 2023

# సమాజ శ్రేయస్సుకు విద్య దోహదపడాలి

**» గవర్నర్ థావర్‌చంద్ గెహ్లాట్**

**బెంగళూరు, జూలై 10 (ఆంధ్రజ్యోతి):** విద్యా సముపార్జనతో ఏదైనా సాధించవచ్చు నని సమాజ శ్రేయస్సుకు ఇది దోహదపడేలా ఉండాలని గవర్నర్ థావర్‌చంద్ గెహ్లాట్ పేర్కొన్నారు. నగరంలో సోమవారం బెంగళూరు సిటీ యూనివర్సిటీ రెండో స్నాతకోత్సవం ఘనంగా జరిగింది. స్నాతకోత్సవాన్ని గవర్నర్ లాంఛనంగా ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ నేటికీ అనేక గ్రామాల పిల్లలు విద్యకు నోచుకోవడం లేదన్నారు. పట్టాలు పొందిన విద్యార్థులపై గురుతర బాధ్యత ఉందని సమాజ ప్రగతికి కృషి చేయాలని ఆయన సూచించారు. ఈ సందర్భంగా బంగారు పతకాలు సాధించిన విద్యార్థులను ఆయన ప్రత్యేకంగా అభినందించారు. జయదేవ హృద్రోగ పరిశోధనా సంస్థ డైరెక్టర్, పద్మశ్రీ గ్రహీత డాక్టర్ సీఎన్ మంజునాథ్ మాట్లాడుతూ ప్రతి విద్యార్థికి తన కెరీర్‌లో పట్టా అందుకోవడం ఒక గొప్ప మధుర స్మృతినిస్తుందన్నారు. సమాజంలో భాగమైన విద్యార్థులు సర్వతోముఖాభివృద్ధికి నడుం బిగించాలన్నారు. అందుబాటులో ఉన్న శాస్త్రసాంకేతిక పరిజ్ఞానాన్ని గరిష్టంగా వినియోగించుకోవాలన్నారు. సేవా రంగంతోనే సంతృప్తి సాధ్యమన్నారు. చారిత్రాత్మక వర్సిటీ నుంచి బంగారు పతకాలను, పట్టాలను అందుకున్న విద్యార్థులు ధన్యులన్నారు. యూనివర్సిటీ వైస్ చాన్స్‌లర్ ప్రొఫెసర్ లింగరాజ గాంధీ అంతకుముందు అతిథులకు స్వాగతం పలికారు. ఈ స్నాతకోత్సవంలో 5,997 మంది విద్యార్థులు పీజీ పట్టాలను అందుకోగా, 35,911 మంది డిగ్రీ పట్టాలను అందుకున్నారు. 38 బంగారు పతకాలను యూనివర్సిటీ సమకూర్చగా మిగిలిన 13 బంగారు పతకాలను దాతలు సమకూర్చారు. ఉన్నత విద్యాశాఖా మంత్రి డాక్టర్ ఎంసీ సుధాకర్ మాట్లాడుతూ రాష్ట్రంలో సమగ్ర విద్యాప్రగతిని తమ ప్రభుత్వం కట్టుబడి ఉందన్నారు. రిజిస్ట్రార్ సీఎన్ శ్రీధర్‌తో పాటు పలువురు ప్రముఖులు స్నాతకోత్సవంలో పాల్గొన్నారు. విద్యార్థులు తదితరులు పాల్గొన్నారు.



ముఖ్య అతిథులతో గవర్నర్ థావర్‌చంద్ గెహ్లాట్ తదితరులు



బంగారు పతకాలతో విద్యార్థులు

ఈనాడు
epaper.eenadu.net

Date : 11/07/2023

# విద్యావిధానంలో మానవీయ విలువలకు అగ్రాసనం

## గవర్నర్ థావర్‌చంద్ గహ్లోత్ ఉవాచ

బెంగళూరు (క్రీడలు), న్యూస్‌టుడే: దేశ ఆర్థిక, సామాజిక, సాంకేతిక అభివృద్ధికి మానవతా విలువలను పెంచడం అత్యవసరమని గవర్నర్ థావర్‌చంద్ గహ్లోత్ పేర్కొన్నారు. సోమవారం నగరంలోని సెంట్రల్ కళాశాలలో నిర్వహించిన రెండో స్నాతకోత్సవానికి గవర్నర్ అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ విద్యా విధానంలో మానవీయ విలువలను చేర్చడాన్ని నిర్ధరించడం విద్యావేత్తలు, విధాన రూపకర్తలు మానవతావాదులు, సమాజ బాధ్యత అని అభిప్రాయపడ్డారు. విశ్వవిద్యాలయాలు సామాజిక సంప్రదాయాల పరిశోధనను ప్రోత్సహిస్తున్నాయి, అందుబాటులో ఉండే జీవనశైలి, మానవాళికి వాతావరణంతో తలెత్తే సమస్యలపై ఆలోచించాల్సిన అవసరముందన్నారు. పేదలు, బలహీనులు, మన పర్యావరణ పరిరక్షణకు ప్రాధాన్యం ఇవ్వాలన్నారు. ప్రస్తుతం స్వావలంబన బలమైన భారత్‌పై చర్చ జరుగుతోంది. ఇలాంటి సమయంలో డిజిటల్ కార్యక్రమాలు, సాంకేతికత వినియోగాలు ప్రతిభగల విద్యార్థులకు ఎంతో ఉపయోగకరమన్నారు. మన విద్య, సంస్కృతి, సంప్రదాయాలు చాలా పురాతనమైనవి, ప్రాచీన కాలం నుంచి సర్వే జన సుఖినో భవంతు అనే స్ఫూర్తి పొంది ఉందన్నారు. 75 స్వాతంత్ర్య సంవత్సరాల్లో భారత్ అన్ని క్షేత్రాల్లో అద్భుతమైన ప్రగతిని సాధించింది. ఆర్థిక అంశంలో ఐదో అతిపెద్ద దేశంగా మన భారత్ గుర్తింపు పొందిందన్నారు. వచ్చే 25 అమృత కాలంలో ప్రపంచ దేశాల్లో మన భారత దేశం చేరుకోనుందన్నారు. ఈ వేడుకల్లో శిక్షణ, సాహిత్య, సామాజిక క్షేత్రాల్లో సాధనలు చేసిన నిసార్ అహమ్మద్, డా.ఉడే పి.కృష్ణ, తారిణి చిదానందకు గౌరవ డాక్టరేట్ గౌరవాన్ని వర్సిటీ తరఫున అందించి సత్కరించారు. ఈ వేడుకల్లో జయదేవ హృద్రోగ విజ్ఞాన పరిశోధన సంస్థ డైరెక్టర్ డా. సి.ఎన్.మంజునాథ, ఆతిథ్య వర్సిటీ ఉప కులపతి లింగరాజ గాంధి పాల్గొన్నారు. పురుషుల విభాగంలో 14,872 మంది, మహిళల విభాగంలో 21,239 మంది పట్టాలు అందుకొన్నారు. స్నాతకోత్సవంలో 5,937 మంది విద్యార్థులు పట్టా అందుకొన్నారు. 51 మంది స్వర్ణపతకాలు అందుకొన్నారు. పట్టాలను అందుకొన్న విద్యార్థులకు విశ్వవిద్యాలయం అందించే బంగారు పతకాలతో పాటు దాతలు అందించిన పసిడిపతకాలు, నగదు పురస్కారాలను స్వీకరించారు. బెం.నగర వర్సిటీకి చెందిన పద్మావతి వి.కె.నాయర్ ఎమ్మెస్సీలో మూడు స్వర్ణపతకాలు, బీపీఎల్‌లో ఎస్.దీప్తి మూడు బంగారు పతకాలు, బీకాంలో ఎం.అజిత్‌కుమార్ మూడు పసిడి పతకాలు అందుకొన్నారు.



పట్టాలను అందుకొన్న విద్యార్థులు



మూడు పసిడి పతకాలను అందుకొన్న దీప్తి, అజిత్‌కుమార్, పద్మావతినాయర్

రాజేంద్రప్రసాద్‌కు అవార్డును ప్రదానం చేస్తున్న పీఠాధిపతి

**మంత్రాలయం, ఫిబ్రవరి 21:** మంత్రాలయం రాఘవేంద్రస్వామి గురు వైభవోత్సవాల్లో భాగంగా మంగళవారం రాత్రి 9.30 గంటలకు యోగీంద్ర సభా మంటపంలో గురు వైభవోత్సవ-2023 అవార్డులను పీఠాధిపతి సుబుధేంద్రతీర్థులు ప్రదానం చేశారు. ప్రముఖ సినీ నటుడు డా.జి. రాజేంద్రప్రసాద్, బెంగుళూరు నేషనల్ అసోసియేషన్ క్యారియర్ కాలేజెస్ డైరెక్టర్ ప్రొ.ఎస్.సి శర్మ, శేషాద్రిపురం ఎడ్యుకేషనల్ సెక్రటరీ ఉడపే కృష్ణలకు అవార్డు, మెమెంటో ప్రశంసా పత్రం, నగదు, వెండి గిన్నె, రాఘవేంద్రస్వామి మెమెంటో, ఫలపుష్ప మంత్రాక్షితలు, పరిమళ ప్రసాదం ఇచ్చి సత్కరించారు. ఈ కార్యక్రమంలో ఏఏవో మాధవశెట్టి, ఎస్కే శ్రీనివాసరావు, ఆదోని డీఎస్పీ వినోద్ కుమార్, సీఐ శ్రీనివాసులు, ఎస్ఐలు వేణుగోపాల్‌రాజు, వెంకటేష్‌లు, ఐపీ నరసింహమూర్తి పాల్గొన్నారు.

**రాఘవేంద్రుని సన్నిధిలో ప్రముఖులు:** మంత్రాలయం రాఘవేంద్ర స్వామి దర్శనార్థం ప్రముఖ సినీ నటుడు రాజేంద్రప్రసాద్, విద్యుత్ విజిలెన్స్ ఎస్పీ శారద, సుప్రీంకోర్టు అటార్నీ జనరల్ వెంకటరమణి వేర్వేరు సమయాల్లో మంగళవారం మంత్రాలయానికి వచ్చారు. వీరికి మఠం అధికారులు ఘనంగా స్వాగతం పలికారు. గ్రామదేవత మంచాలమ్మను దర్శించుకుని రాఘవేంద్ర స్వామి మూల బృందావనానికి విశేష పూజలు చేశారు. అనంతరం మఠం పీఠాధిపతి సుబుధేంద్ర తీర్థులు మెమెంటో, శేషవస్త్రం, ఫల, పుష్ప, మంత్రాక్షితలు, పరిమళ ప్రసాదం ఇచ్చి ఆశీర్వదించారు.

# స్థల వివాదంలో ఘర్షణ

# గురువైభవోత్సవాలు

మంత్రాలయం, న్యూస్‌టుడే: రాఘవేంద్ర స్వామి గురువైభవోత్సవాలు మంగళవారం వైభవంగా ప్రారంభమయ్యాయి. స్వామి బృందావనానికి జలాభిషేకం, పంచామృతాభిషేకం నిర్వహించి బంగారు ఆభరణాలు, విశేషపుష్పాలతో అలంకరించారు. మూలరాములకు పీఠాధిపతి సుబుదేంద్ర తీర్థులు పూజలు చేసిన అనంతరం బృందావనానికి హారతి ఇచ్చారు. తొలి రోజున మంచాలమ్మ, రాఘవేంద్ర స్వామి బృందావనాన్ని ప్రముఖులు దర్శించుకున్నారు. ప్రముఖ నటుడు డాక్టర్. రాజేంద్ర ప్రసాద్, బెంగళూరు ఎన్‌పీసీసీ డైరెక్టర్ ఎస్.సి. శర్మలకు మంగళవారం అభినందన, అభివందన పురస్కారాలు అందజేశారు. ఈ కార్యక్రమంలో ఎస్కే. శ్రీనివాసరావు, వెంకటేశ్ జోషి, శ్రీపతి ఆచార్, ఐపీ. నరసింహమూర్తి, బిందు మాధవ్, శ్రీనిధి, డీఎస్పీ వినోద్ కుమార్, సీఐ శ్రీనివాసులు, ఎస్సై వేణుగోపాల్‌రాజు, వెంకటేశ్వర్లు, తదితరులు పాల్గొన్నారు.



పురస్కారం అందుకుంటున్న సినీ నటుడు రాజేంద్రప్రసాద్

రాఘవేంద్ర స్వామి పట్టాభిషేకం బుధవారం వైభవంగా నిర్వహించేందుకు ఏర్పాట్లు చేసినట్లు మేనేజర్ ఎస్‌కే. శ్రీనివాసరావు తెలిపారు. స్వామి పాదుకలు బంగారు సింహాసనంపై ఉంచి వివిధ పుష్పాలు, ముత్యాలతో అలంకరిస్తారు. ఊయలలో పాదుకలు ఉంచి రాఘవేంద్రస్వామిగా భావించి పట్టాభిషేకం నిర్వహిస్తారు. అనంతరం ప్రముఖులను సన్మానిస్తారు.

ఈనాడు
epaper.eenadu.net

Date : 02/02/2023

# మానవతావాది.. మహాత్ముడే



స్వాగతం పలుకుతున్న విద్యార్థులను పలకరిస్తున్న బొమ్మై

బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే : భారతదేశానికి ప్రాతినిధ్యం వహించిన ఏకైక ఆత్మ మహాత్ముడేనని ముఖ్యమంత్రి బొమ్మై కీర్తించారు. విలువలతో కూడిన జీవితం, సత్యం, దేశప్రేమతో కూడిన ఆలోచనలు, ఆధ్యాత్మ మానవతావాది- అన్నీ మనం గాంధీజీలో మాత్రమే చూడగలమని అన్నారు. ఆయన చూపించిన బాటలో ప్రయాణించడమే ఆయనకు మనమిచ్చే నిజమైన గౌరవమని వివరించారు. వివేకయుగ, గవ్య ఫౌండేషన్, పరిశ్రమలు, వాణిజ్య శాఖ, కర్ణాటక గాంధీ స్మారక ఫౌండేషన్ సంయుక్తంగా 'గాంధీ స్మరణ- గాంధీ నమన' పేరిట విధానసౌధ మెట్లపై బుధవారం నిర్వహించిన కార్యక్రమాన్ని సీఎం ప్రారంభించి మాట్లాడారు. మహాత్ముడిని గుర్తు చేసుకోవడమంటే, ఆయనను స్మరించుకోవడమేనని విశ్లేషించారు. మనిషి మెదడు మంచిని- చెడును రెండింటినీ గుర్తించుకుంటుందని- అదే మెదడు మనకు నడిచే దారి దీపంగా ఉంటే విలువలను పాటిస్తుంటే మనం మంచి పనులు చేయగలమని విశదీకరించారు. మహాత్మునికి మెదడు-హృదయం రెండూ ఒక్కటేనన్నారు. అహింసా సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, దాన్నే ఆయుధంగా చేసుకుని తన పోరాటాన్ని కొనసాగించిన మహాత్ముడి జీవిత చరిత్రను నేటి యువత చదివి అందులోని అంశాలను ఒంటబట్టించుకోవాలని పిలుపునిచ్చారు. మనదేశంపై విదేశీయులకు ఉన్న అభిప్రాయాలను మార్చివేయడంలో గాంధీజీ తీసుకున్న చర్యలు సత్ఫలితాలు ఇచ్చాయని చెప్పారు. రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత అన్ని చోట్ల ప్రజాస్వామ్య వ్యవస్థలు ఏర్పడుతున్న సమయంలో ప్రపంచంలోని అన్ని దేశాలూ భారత్ పట్ల గౌరవంగా వ్యవహరించడం వెనుక ఆయన శ్రమ దాగి ఉందన్నారు. సర్వోన్నత న్యాయస్థానం విశ్రాంత న్యాయమూర్తి జస్టిస్ శివరాజ్ పాటిల్, వివిధ సంస్థల ప్రతినిధులు రవీంద్ర భట్, పి.హెచ్ కృష్ణ, డీఎం హెగ్డే తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు.



వేదికపై ప్రమాణం చేస్తున్న ముఖ్యమంత్రి, ఇతర ప్రతినిధులు



గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న సీఎం బొమ్మై

# ప్రతికారంగంలో తపస్వి రామయ్య : సీఎం

బెంగళూరు, అక్టోబరు 27 (ఆంధ్రజ్యోతి): సీనియర్ పాత్రికేయుడు పి.రామయ్య పత్రికారంగంలో తపస్వి లాంటి వారని ముఖ్యమంత్రి బసవరాజ బొమ్మై ప్రశంసలు గుప్పించారు. బెంగళూరు గాంధీభవన్‌లో గురువారం అభిమాని ప్రకాషన్ ముద్రించిన ప్రముఖ పాత్రికేయుడు పి.రామయ్య అనుభవాలతో కూడిన నాను హిందూ రామయ్య గ్రంధాన్ని సీఎం ఆవిష్కరించారు. రామయ్య నిజాలను నిర్భీతిగా వార్తల రూపంలో అందిచేవారని సీఎం పేర్కొన్నారు. తమ తండ్రికాలం నుండి రామయ్య పేరు వింటూ వచ్చానన్నారు. ఎందరో పాత్రికేయులకు ఆయన గొప్ప మార్గదర్శకుడిగా వ్యవహరించారన్నారు. ఈ కార్యక్రమానికి కర్ణాటక గాంధీ స్మారక ట్రస్టు అధ్యక్షుడు నాడోజ డా.వూడే పి.కృష్ణ అధ్యక్షత వహించగా. గ్రంథ పరిచయాన్ని సంయుక్త కర్ణాటక ప్రధాన సంపాదకుడు హూ ణసవాడి రాజన్ చేశారు. రామయ్యతో తనకు ఉన్న అనుబంధాన్ని ఆయన స్మరించుకున్నారు. అభిమాని ప్రచురణ గ్రూప్ సంస్థల అధ్యక్షుడు టి. వెంకటేశ్, కర్టాటక మీడియా అకాడమీ చైర్మన్ సదాశివ శెణై, కర్ణాటక వర్కింగ్ జర్నలిస్టుల సంఘం అధ్యక్షుడు శివానంద తగడూరు, బెంగళూరు ప్రెస్‌క్లబ్ అధ్యక్షుడు ఆర్.శ్రీధర్ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**ఈనాడు** సోమవారం ఏప్రిల్ 29, 2019



**ఉత్తమ పురస్కారాలు అందుకున్న వారితో అభ్యుదయ రైతులు**

# నీటి సంరక్షణకు కంకణబద్ధం

మాట్లాడారు. దేశంలో ఆరు కోట్లకు పైగా బోరు బావులు ఉన్నాయని, వాటిలో 80 శాతం నీరు లేకుండా ఖాళీగా పడి ఉన్నాయని గుర్తు చేశారు. భూగర్భ జలాల్ని వినియోగించుకోవడంలో ప్రపంచం లోనే భారతదేశం మొదటి స్థానంలో ఉందని గుర్తు చేశారు. రైతులు అప్పులు చేసి, పంటలు పెడుతున్నా, నీటి కొరత, నకిలీ విత్తనాలు, పంటకు గిట్టుబాటు ధర లేక ఆత్మహత్యలకు పాల్పతున్నారని తెలిపారు. యోగా, ధ్యానం చేయడం ద్వారా పలు వ్యాధులకు దూరంగా ఉండవచ్చని కార్యక్రమంలో పాల్గొన్న యోగ గురువు జగదీశ్ శెట్టి పేర్కొన్నారు. ఆహారాన్ని పరిమితంగా తీసుకుని, నీటిని ఎక్కువగా తాగితే ఆరోగ్యం మన అదుపులో ఉంటుందని చెప్పారు. కార్యక్రమంలో ట్రస్టు అధ్యక్షుడు విజయ్ సమర్థ, గాంధి శాంతి ప్రతిష్ఠాన అధ్యక్షుడు డాక్టర్ వోడె పి. కృష్ణ, వివిధ రంగాలకు చెందిన షడక్షరి, చెన్నే గౌడ తదితరులు పాల్గొన్నారు.

ఆంధ్రజ్యోతి

# యువత గాంధీజీ ఆశయాలను పాటించాలి

## - కసాప అధ్యక్షుడు మనూబళిగార్ పిలుపు



వేదికపై గాంధీ వేషధారి ఇలా..

**బెంగళూరు, మార్చి 10 (ఆంధ్రజ్యోతి):** యువత గాంధీజీ ఆశయాలను పాటించాలని కన్నడ సాహిత్య పరిషత్ అధ్యక్షుడు, నాడోజా మనూబళిగార్ అభిప్రాయపడ్డారు. బుద్ధ బసవగాంధీ సాంస్కృతిక ట్రస్టు, శేషాద్రిపురం శిక్షణా సంస్థ, కర్ణాటక గాంధీ స్మారక నిధి, గాంధీ శాంతి ప్రతిష్ఠాన సంయుక్త ఆధ్వర్యంలో ఆదివారం శేషాద్రిపురం కళాశాలలో రాష్ట్రస్థాయి యువజన సమ్మేళనం జరిగింది. గాంధీ స్మారక నిధి కార్యదర్శి ఇందిరాకృష్ణప్ప, బుద్ధబసవ గాంధీ ట్రస్టు కార్యదర్శి హేమావతిల పర్యవేక్షణలో బెంగళూరు విశ్వవిద్యాలయం సాహితీ పరిశోధకులు డి.కె.చిత్తయ్యపూజార్ అధ్యక్షతన సమ్మేళనం సాగింది. కర్ణాటక గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు ఊడే పి.కృష్ణ, కన్నడ పుస్తక ప్రాధికార మాజీ అధ్యక్షుడు బంజగెరె జయప్రకాశ్‌లతోపాటు ముఖ్యులు పాల్గొన్నారు. కసాప అధ్యక్షుడు మనూబళిగార్ మాట్లాడుతూ సమాజంలో ఎన్నో మార్పులు వచ్చాయని అయితే గాంధీజీ ఆశయాలు నేటి యువత ఆదర్శంగా తీసుకోవాల్సి ఉందన్నారు. దేశం కోసం గాంధీజీ పిలుపుతో ఎంతోమంది త్యాగాలు చేశారన్నారు. యువసమాజం దేశంలో కొత్త ఆవిష్కరణలకు పునాదులు వేయాలన్నారు. అనంతరం సుగమ సంగీత కార్యక్రమాలు అలరించాయి.



పుస్తకావిష్కరణలో మనూబళిగార్ తదితరులు

# పెద్దల రచనలతో యువతలో ప్రేరణ



చిత్తయ్య పూజార్‌ను సత్కరిస్తున్న మను బళిగార్ తదితరులు

**బెంగళూరు (సదాశివనగర), న్యూస్‌టుడే :** మహాత్మాగాంధీ, వివేకానందుల జీవిత చరిత్రను యువత చదుకునేలా ప్రేరేపించాల్సిన అవసరం ఉందని కన్నడ సాహిత్య పరిషత్ అధ్యక్షుడు మను బళిగార్ పేర్కొన్నారు. శేషాద్రిపురం ఎడ్యుకేషనల్ ట్రస్టు ఆదివారం ఇక్కడ నిర్వహించిన రాష్ట్ర స్థాయి యువ సమ్మేళనాలను ప్రారంభించి మాట్లాడారు. నేటి యువత సాహిత్యం, పోరాటాలకు దూరంగా ఉంటున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రముఖుల జీవిత చరిత్రలను అధ్యయనం చేయడం ద్వారా వారిలో పోరాట మనో భావం వస్తుందని పేర్కొన్నారు. బెంగళూరు వర్సిటీలో పరిశోధకుడు డి.కె.చిత్తయ్య పూజార్‌ను ఇదే సందర్భంలో సత్కరించారు. కార్యక్రమంలో సాహితీవేత్త బంజగెరె జయ ప్రకాశ్, గాంధి స్మారక నిధి అధ్యక్షుడు వోడే పి.కృష్ణ తదితరులు పాల్గొన్నారు.

ఆంధ్రజ్యోతి
కర్ణాటక ● శనివారం 12 జనవరి 2019

# దేశాభిమాని పాటిల్ పుట్టప్ప

**- పశుసంవర్ధకశాఖ మంత్రి వెంకటరావ్‌నాడగౌడ**

బెంగళూరు, జనవరి 11 (ఆంధ్రజ్యోతి): స్వాభిమానం, భాషాభిమానం దేశాభిమానంకు నాడోజ పాటిల్‌పుట్టప్ప నిదర్శనంలాంటివారని పశుసంవర్ధకశాఖ మంత్రి వెంకటరావ్‌నాడగౌడ పేర్కొన్నారు. గాంధీభవన్‌లో శుక్రవారం పాటిల్ పుట్టప్ప వందో పుట్టినరోజు వేడుకలు గాంధీ స్మారకనిధి ద్వారా నిర్వహించారు. పాటిల్ పుట్టప్పకు ఈనెల 14కు వందేళ్ళు పూర్తి కానున్నాయి. ఈ సందర్భంగా మంత్రి మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలు కన్నడలోనే కొనసాగేందుకు పాటిల్ పుట్టప్ప మూలకారకుడన్నారు. కన్నడిగులకు ఆదర్శప్రాయులన్నారు. పాటిల్ పుట్టప్ప పత్రికారంగంలో భీష్ముడిలాంటివారన్నారు. పత్రికారంగం, రాజకీయ, సాహిత్య రంగాల ఆయన సేవలు సాగాయన్నారు. స్వాతంత్ర్య పోరాటంలో మహాత్మాగాంధీని కలిసిన ఓ ...లుడని కొనియాడారు. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం నుంచి



నాడోజ డా.పాటిల్‌పుట్టప్పకు ఆత్మీయ సన్మానం.

పాత్రికేయ పట్టాను పొందారన్నారు. పుట్టప్ప సమాజంలో మార్పుకోసం కృషి చేశారని పాత్రికేయ వృత్తిద్వారా ఎంతోమందిని ప్రోత్సహించారన్నారు. సాహితీదిగ్గజాలు గో.రూ.చెన్నబసప్ప, అరవిందజట్టి, ఊడి పి.కృష్ణ, అరవింద, ఎం.వి. రాజశేఖరన్, హనుమంతప్పలు, విద్యానిపుణులు రాధాక్రిష్ణ, బి.ఎల్.శంకర్‌లు పాటిల్ పుట్టప్పను ఘనంగా సత్కరించారు.

కర్ణాటక | శనివారం |
జనవరి | 12 | 2019

# పాటిల్ పుట్టప్ప సేవలు అనన్యం


పాటిల్ పుట్టప్పను సన్మానిస్తున్న మంత్రి వెంకట్రావ్ నాడగౌడ

శివాజీనగర: స్వాభిమానం, భాషాభిమానం, దేశాభిమానానికి నాడోజ పాటిల్ పుట్టప్ప ప్రతీక అని రాష్ట్ర పశు సంవర్ధక, మత్స్య శాఖ మంత్రి వెంకటరావు నాడగౌడ పేర్కొన్నారు. పాటిల్ పుట్టప్ప జన్మశతోత్సవ కమిటీ, బసవ సమితి, గాంధీ స్మారక నిధి సంయుక్త ఆధ్వర్యంలో గాంధీభవన్‌లో శుక్రవారం ఏర్పాటు చేసిన నాడోజ డాక్టర్ పాటిల్ పుట్టప్ప జన్మశతోత్సవ కార్యక్రమాన్ని ఆయన ప్రారంభించి ముఖ్యమంత్రి సందేశాన్ని వివరించారు. రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలు కన్నడలో జరిగేలా పాటిల్ పుట్టప్ప కృషి చేశారన్నారు. పత్రిక రంగంలో భీష్ముడిగా పేరు గాంచారని, రాజకీయ రంగంలో, స్వాతంత్ర్య పోరాటంలో తనదైనశైలిలో సేవలందించారని ప్రశంసించారు. పాటిల్ పుట్టప్ప జన్మించి ఈనెల 14నాటికి వంధ సంవత్సరాలు పూర్తవుతున్నందున జన్మశతోత్సవాన్ని నిర్వహించినట్లు చెప్పారు.అనంతరం పాటిల్ పుట్టప్పను ఘనంగా సన్మానించారు. కార్యక్రమంలో సీనియర్ సాహితీవేత్త గొరురు చెన్నబసప్ప, అరవింద జత్తి, వుడ పి.కృష్ణ, కేంద్ర మాజీ మంత్రి ఎం.వి.రాజశేఖరన్, రాజ్యసభ మాజీ సభ్యుడు హనుమంతప్ప, బి.ఎల్.శంకర్, విద్యానిపుణుడు రాధాకృష్ణ పాల్గొన్నారు.

ఆంధ్రజ్యోతి Sat, 29 December 2018
https://epaper.andhrajyothy.com/c/35289296



# ఘనంగా అగరాల జన్మదిన వేడుకలు



అగరాల రచించిన 'ఇందిరాగాంధీ గొప్ప ప్రజాస్వామ్య వాది' పుస్తకావిష్కరణ

తిరుపతి(విద్య), డిసెంబరు 28: ఆంధ్రప్రదేశ్ మాజీ స్పీకర్, మైఫా వ్యవస్థాపక అధ్యక్షుడు డాక్టర్ అగరాల ఈశ్వరరెడ్డి 86వ జన్మదిన వేడుకలు శుక్రవారం ఘనంగా జరిగాయి. మాజీ సీఎస్ బీపీ రామారావు, రిటైర్డ్ కలెక్టర్ ఎన్‌కే పచూరి, కర్నాటక గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు వీ. కృష్ణ, మాజీ ఎమ్మెల్యే టీవీ రాజన్‌లు వచ్చి అగరాలకు శుభాకాంక్షలు తెలిపి మాట్లాడారు. ఈ సందర్భంగా 150 వసంతాల గాంధీజీ ఆశయాలు అన్న అంశంపై వారు మాట్లాడుతూ అంటరానితనం రూపు మాపడానికి ప్రతి ఒక్కరూ కృషి చేయాలని పిలుపునిచ్చారు. కాగా అగరాల రచించిన ఇందిరాగాంధీ- గొప్ప ప్రజాస్వామ్య వాది పుస్తకాన్ని ఆవిష్కరించారు. తిరుపతి ఎమ్మెల్యే సుగుణ, చంద్రగిరి ఎమ్మెల్యే చెవిరెడ్డి భాస్కర్‌రెడ్డిలు ఆయన్ను పుష్పగుచ్ఛాలతో అభినందించి శుభాకాంక్షలు తెలిపారు. ఈ కార్యక్రమంలో అగరాల ఉమ జగన్మోహన్‌రెడ్డి, ప్రమీలమ్మ, స్వరాజ్యలక్ష్మి, డాక్టర్ జి. నాగేంద్రబాబు, పలువురు ప్రజలు పాల్గొన్నారు.

# 'స్వదేశీ నినాదాన్ని పుణికి పుచ్చుకుందాం'

**బెంగళూరు (మల్లేశ్వరం), న్యూస్‌టుడే:** ప్రతి ఒక్కరూ స్వదేశీ ఉత్పత్తులనే కొనుగోలు చేయాలని నాడోజ డా. పాటిల్ పుట్టప్ప పిలుపునిచ్చారు. మహాత్ముని 150వ జయంత్యుత్సవాల్లో భాగంగా గాంధీభవన్‌లో సోమవారం నిర్వహించిన కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. గ్రామ స్వరాజ్యం పేరిట మహాత్ముడు ఇచ్చిన పిలుపును అందరూ అర్థం చేసుకుంటే, దేశ ఆర్థిక ప్రగతి మరింత వేగంగా కొనసాగుతుందని అభిప్రాయపడ్డారు. నేటి యువత విదేశీ వ్యామోహంతో పాశ్చాత్యులను అనుకరించడం దురదృష్టకరమన్నారు. తాను పదేళ్ల బాలునిగా ఉన్న సమయంలో మహాత్ముడు, నెహ్రూ ఇద్దరూ హుబ్బళ్లికి వచ్చారని, వారు తమ ప్రసంగంలో ఖాదీ వస్త్రాలను ధరించాలని చెప్పగా, అప్పటి నుంచి తాను వాటినే ధరిస్తూ వచ్చానని గుర్తు చేసుకున్నారు. దేశీయ ఉత్పత్తులను వినియోగించడం ద్వారా స్థానిక కార్మికులు, ఉత్పాదకులు నిలదొక్కుకునేందుకు అవకాశం కలుగుతుందని వివరించారు. కార్యక్రమంలో కేంద్ర మాజీ మంత్రి ఎం. వి. రాజశేఖరన్, విశ్రాంత ఆచార్యుడు శాంతినాథ దిబ్బద, గాంధీ ప్రతిష్ఠాన ప్రతినిధులు వోడె పి. కృష్ణ, డా. లోహిత నాయక, ఇందిరా కృష్ణప్ప పాల్గొన్నారు.



మహాత్మునికి నివాళి అర్పిస్తున్న పాటిల్ పుట్టప్ప

ఈనాడు

గురువారం నవంబరు 1, 2018

# తపాలా చీటీ విడుదల



తపాలా చీటీ విడుదల చేసి ప్రదర్శిస్తున్న దొరెస్వామి

**బెంగళూరు (సదాశివనగర), న్యూస్‌టుడే:** గోపాల కృష్ణ గోఖలే, మహాత్ముని ముఖ చిత్రంతో ప్రత్యేకంగా రూపొందించిన తపాలా చీటీని స్వాతంత్ర్య సమరయోధుడు దొరెస్వామి బుధవారం ఇక్కడ విడుదల చేశారు. గురు, శిష్యులుగా గుర్తింపు పొందిన వీరిద్దరి తపాలా బిళ్లను తపాలాశాఖ రూపొందించింది. మహాత్ముని 150వ జయంతి పురస్కరించుకుని దీన్ని రూపొందించారు. చీఫ్ పోస్ట్ మాస్టర్ జనరల్ చార్లెస్ లోబో, గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు వోడె పి.కృష్ణ తదితరులు పాల్గొన్నారు.

# ప్రసన్నకు గాంధీ పురస్కారం

బెంగళూరు (సదాశివనగర), న్యూస్‌టుడే : మహాత్మా గాంధీ సేవా పురస్కారాన్ని ఈ ఏడాది ప్రముఖ నాటకకర్త, సామాజిక కార్యకర్త వి.ప్రసన్న అందుకున్నారు. గాంధేయవాదిగా ఆయన పలు పోరాటాలు చేశారు. హస్తకళా ఉత్పత్తులపై వస్తువులు, సేవల పన్నులు వద్దంటూ ఆయన కొద్ది నెలల కిందట ఉపవాస సత్యాగ్రహాన్ని చేశారు. సమాచారశాఖ మంగళవారం సాయంత్రం నిర్వహించిన కార్యక్రమంలో ముఖ్యమంత్రి కుమారస్వామి ఆయనకు పురస్కారాన్ని అందించారు. కార్యక్రమంలో భాగంగా మహాత్ముని జీవిత చరిత్ర, అందులోని కీలక ఘట్టాలకు సంబంధించిన చిరుపుస్తకాలను ఆవిష్కరించారు.

◆ మహాత్ముడు పేర్కొన్న గ్రామ స్వరాజ్యం కోసం శ్రమిస్తున్న సామాజిక కార్యకర్తలు, ఉపాధ్యాయులు, వ్యక్తులకు ముఖ్యమంత్రి కుమారస్వామి గాంధీ గ్రామ పురస్కారాలను అందించారు. విధానసౌధ బాంక్వెట్ హాల్‌లో మంగళవారం రాత్రి నిర్వహించిన కార్యక్రమంలో పురస్కారాలను అందజేశారు.



ముఖ్యమంత్రి నుంచి పురస్కారాన్ని అందుకుంటున్న ప్రసన్న

# గాంధీభవనాల్లో సిద్ధాంత భేరి!

○ రాష్ట్ర వ్యాప్తంగా చైతన్య కేంద్రాలు

○ యువతకు చేయూత: ముఖ్యమంత్రి

బాపూజీ ఆశయాల సాధనకు బెంగళూరులోని గాంధీభవన్ ఎంతో ఉపయుక్తంగా మారింది. సిద్ధాంతాల ప్రచారంతో పాటు.. వాటి అమలుకు ఇదొక కీలక భూమిక పోషించే కేంద్రం. ఇలాంటి భవన్‌లు రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లా కేంద్రాలకూ విస్తరించబోతున్నాయి. సంబంధిత కార్యాచరణను ముఖ్యమంత్రి కుమారస్వామి వెల్లడించడం కీలక మలుపు.

కేంద్ర వార్త- ప్రసారాల శాఖ బెంగళూరు గాంధీభవన్‌లో ప్రత్యేక ఛాయాచిత్ర ప్రదర్శన మంగళవారం ప్రారంభించింది. గాంధీ జీవిత చరిత్ర తెలుసుకునేందుకు ఇదెంతో ఉపయుక్తం. చిత్రాల ప్రదర్శన నిత్యం ఉదయం 10 నుంచి సాయంత్రం ఐదు గంటల వరకు ఈనెల 4 వరకు కొనసాగుతుంది.



జీవనఘట్టాలు కేంద్ర వార్త-ప్రసారాల శాఖ అధ్వర్యంలో గాంధీజీపై రూపొందించిన ఛాయాచిత్రాల ప్రదర్శన తిలకిస్తున్న ముఖ్యమంత్రి కుమారస్వామి తదితరులు

బెంగళూరు (సదాశివనగర), న్యూస్‌టుడే : రాష్ట్రంలోని అన్ని జిల్లా కేంద్రాల్లో 'గాంధీ భవన్'లు నిర్మిస్తామని, వాటి కోసం 20 రోజుల్లోగా అవసరమైన భూముల్ని గుర్తించి నిర్మాణాలు ప్రారంభిస్తామని ముఖ్యమంత్రి కుమారస్వామి ప్రకటించారు. బాపూజీ 150వ జయంతి సందర్భంగా మంగళవారం బెంగళూరులో గాంధీ స్మారకనిధి, కేంద్ర వార్త ప్రసార శాఖ సంయుక్తంగా ఏర్పాటు చేసిన ఛాయా చిత్రాల ప్రదర్శనను కుమార ప్రారంభించి ప్రసంగించారు. ఇప్పటికే 16 జిల్లా కేంద్రాల్లో గాంధీభవనాల నిర్మాణానికి భూముల్ని గుర్తించామని తెలిపారు. ఆ కేంద్రాల్లో ఏడాది పాటు యువతను చైతన్యవంతులను చేసే కార్యక్రమాలకు శ్రీకారం చుడతామన్నారు. నేటితరాన్ని స్ఫూర్తిమంతంగా తీర్చిదిద్దడానికి వేదికలు రూపొందిస్తామన్నారు. అనేక వృత్తుల్లో శిక్షణ ఇవ్వడం అందులో ఓ ప్రధానాంశంగా చేరుస్తామన్నారు. 'పుష్కర కాలం కిందట నేనున బెంగళూరులోని గాంధీభవన్‌ను సందర్శించా. అప్పట్లో ఈ భవనం పాడుపడినట్లు ఉండేది. అప్పటికప్పుడు బెంగళూరు నగరాభివృద్ధి కమిషనర్‌ను రప్పించి మరమ్మతులు చేపట్టాలని రూ.కోటి విడుదల చేశా. భవనాన్ని ఆధునికీకరించేందుకు శ్రమించా'నని నాటి జ్ఞాపకాలను నెమరు వేసుకున్నారు. 'గాంధీ

మిగతా 3లో ▶

## గాంధీభవనాల్లో సిద్ధాంత భేరి!

(మొదటి పేజీ తరువాయి)

చెప్పినట్లు.. ప్రస్తుతం రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే వచ్చింది. సామాజిక, ఆర్థిక స్వాతంత్ర్యం రాలేదు. గ్రామీణుల బతుకులు బాగు చేసేందుకు మేమెంతో శ్రమిస్తున్నాం. నేను హఠాత్తుగా రాజకీయాల్లోకి వచ్చా. అదే సమయంలో గాంధీ చూపిన బాటలోనే ప్రయాణిస్తున్నా. ఆయన ఆశించిన గ్రామ స్వరాజ్య సాధనే లక్ష్యం. గ్రామీణుల సమస్యలను తెలుసుకునేందుకు అక్కడే నిద్రించడం, జనతాదర్శన్ నిర్వహణ తదితర కార్యక్రమాలు ఆ దిశగా చేపట్టినవే'నని వివరించారు. గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు డాక్టర్ ఉడే పి.కృష్ణ మాట్లాడుతూ అవినీతి, పేదరికం, ఉగ్రవాదానికి వ్యతిరేకంగా నేటి యువత పోరాటం చేయాలని పిలుపునిచ్చారు. కార్యక్రమంలో కేంద్ర మాజీ మంత్రి ఎం.వి.రాజశేఖరన్, మాజీ మంత్రి హెచ్.కె.పాటిల్, గాంధీ సేవా పురస్కార గ్రహీత చెన్నమ్మ హళ్లికేరి, వార్త ప్రసార శాఖ సంచాలకుడు విశుకుమార్ తదితరులు పాల్గొన్నారు.

◆ రుణ మాఫీ పథకాన్ని అమలులోకి తీసుకు వచ్చినా అన్నదాతలు బలవన్మరణం చేసుకోవడం నన్ను కలిచి వేస్తోందని ముఖ్యమంత్రి కుమారస్వామి ఆవేదన వ్యక్తం చేశారు. గాంధీజయంతి నేపథ్యంలో ఆయన బెంగళూరులో ఏర్పాటు చేసిన ఓ కార్యక్రమంలో ప్రసంగిస్తూ.. జీవితాన్ని అంతం చేసుకుని, కుటుంబ సభ్యులను వీధిన పడేయ వద్దని రైతులకు విజ్ఞప్తి చేశారు. సామాన్యులు, నిరుపేదలు, అన్నదాతల సమస్యలను పరిష్కరించేందుకు తమ ప్రభుత్వం ప్రాధాన్యమిస్తుందన్నారు.

ఆంధ్రజ్యోతి

# గాంధీ భవన్‌లలో యువతకు శిక్షణ

**బెంగళూరు, అక్టోబరు 2 (ఆంధ్రజ్యోతి ప్రతినిధి)**

గాంధీభవన్‌లో మంగళవారం గాంధీ స్మారకనిధి ఆధ్వర్యంలో ఏర్పాటైన జాతిపిత 150వ జయంతి వేడుకలను ముఖ్యమంత్రి హెచ్.డి.కుమారస్వామి లాంఛనంగా ప్రారంభించారు. అనంతరం ప్రసంగిస్తూ ఇప్పటికే 16 జిల్లా కేంద్రాలలో గాంధీభవన్‌ల నిర్మాణానికి స్థలాలను గుర్తించామన్నారు. మిగిలిన ప్రాంతాల్లోనూ సాధ్యమైనంత త్వరగా ఇందుకు అనువైన స్థలాలను గుర్తించే ప్రక్రియ చేపట్టాల్సిందిగా జిల్లాధికారులను ఆదేశిస్తానన్నారు. ఈ గాంధీభవన్‌లలో ఏడాది పాటు యువతను తీర్చిదిద్దే రకరకాల కార్యక్రమాలు చేపడతామన్నారు. 12 నెలలక్రితం తాను గాంధీ భవన్‌కు వచ్చినప్పుడు మరమ్మత్తులు చేపట్టాల్సిందిగా అప్పటి బీడీఏ కమిషనర్‌కు విజ్ఞప్తి చేసిన సంగతిని సీఎం స్మరించుకున్నారు. గాంధీజీ మాటల్లో చెప్పాలంటే దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిందే తప్ప సామాజిక, ఆర్థిక స్వాతంత్ర్యం ఇంకా రాలేదని సీఎం ఆవేదన వ్యక్తం చేశారు. జాతిపిత కలలుగన్న రామరాజ్యాన్ని గ్రామ రాజ్యాన్ని సాకారం చేసే దిశలో సంకీర్ణ ప్రభుత్వం పలు కార్యక్రమాలను విజయవంతంగా అమలు చేస్తోందన్నారు. తాను చేపట్టిన జనతాదర్శన్‌కు కూడా గాంధీజీ స్ఫూర్తియే కారణమన్నారు. గాంధీ స్మారక ట్రస్టు అధ్యక్షుడు డా.ఊడే పి.కృష్ణ తదితరులు ఈ సందర్భంగా హాజరయ్యారు.

**ఆత్మహత్యలు వద్దు ప్లీజ్**

రైతు రుణాలను మాఫీ చేసే విషయంలో ప్రభుత్వం ఇచ్చిన మాటకు కట్టుబడి ఉందని సీఎం మరోమారు స్పష్టం చేశారు. గాంధీభవన్‌లో జరిగిన జయంతి వేడుకల అనంతరం ఆయన మీడియాతో మాట్లాడారు. నిరాశ, నిస్పృహలకు లోనై ఆత్మహత్యలకు పాల్పడవద్దని అన్నదాతలకు విజ్ఞప్తి చేశారు.

**ఉత్తమ పాలనకు బదిలీలు అవసరం..**

పాలన సజావుగా చైతన్యవంతంగా సాగాలంటే అడపాదడపా అధికారుల బదిలీలు అవసరమని ముఖ్యమంత్రి కుమారస్వామి అభిప్రాయపడ్డారు. సచివాలయం ప్రాంగణంలో జాతిపిత గాంధీజీకి, మాజీ ప్రధాని లాల్‌బహద్దూర్ శాస్త్రి చిత్రపటాలకు మంగళవారం ఆయన పుష్పాంజలి ఘటించారు. అధికారుల బదిలీలను వక్రకోణంలో చూడ్డం తగదని ప్రతిపక్షాలకు హితవు పలికారు. మహానేతలను నేటి యువతరం స్మరించుకునేలా కార్యక్రమాలు రూపుదిద్దుకోవాలని ఆకాంక్షించారు.



బాపూజీ పుస్తకాలు ఆవిష్కరిస్తున్న సీఎం తదితరులు

కర్ణాటక | సోమవారం | ఆగస్టు | 13 | 2018 సాక్షి బెంగళూరు

# సమాజ సేవకులను సన్మానించడం మన కర్తవ్యం



**కెంగల్ హనుమంతయ్య పురస్కారాలను అందుకున్న సమాజ సేవకులు**

శివాజీనగర: సమాజ సేవకులను సన్మానించడం మన కర్తవ్యమని సుప్రీం కోర్టు విశ్రాంత న్యాయ మూర్తి డాక్టర్ శివరాజ్ పాటిల్ అన్నారు. ఆదివారం నగరంలోని స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని కెంగెల్ హనుమంతయ్య రాష్ట్ర పురస్కార కార్యక్రమంలో పాల్గొని ఆయన మాట్లాడారు. కెంగల్ హనుమంతయ్య పేరుతో అవార్డు ప్రదానం చేయటం అభినందనీయమన్నారు. ఈ సందర్భంగా డాక్టర్ కామినిరావు, కంచాణి శరణప్ప, పాత్రికేయుడు ఆర్.చేతన్, మైసూరుకు చెందిన ఎన్.జీ.ఆర్ అరస్, సంపాదకుడు చెన్నే గౌడ, పారిశ్రామికవేత్త నాగరాజ్ గుప్తా, గజానన ఉమేశ్ భట్‌లతో పాటు 35 మంది సమాజ సేవకులకు కెంగల్ హనుమంతయ్య పురస్కారంతో సన్మానించారు. కార్యక్రమంలో పావగడ ప్రకాశ్, గాంధీ ప్రతిష్టాన అధ్యక్షుడు డాక్టర్ ఓడోపి, ఆర్.పీ.రవిశంకర్, సమర్థ సాంస్కృతిక ప్రతిష్ఠాన అధ్యక్షుడు విజయ్ సమర్థ, మైసూరు సిల్క్ వ్యాపారుల సహకార బ్యాంకు ఉపాధ్యక్షుడు రవిశంకర్ తదితరులు పాల్గొన్నారు.

# కన్నడ సంఘాలు ఒక్కటిగా కదలాలి

**బెంగళూరు (మల్లేశ్వరం) న్యూస్‌టుడే:** ఇతర ప్రాంతాల నుంచి కర్ణాటకకు వచ్చే వారికి కన్నడ భాషను, సాహిత్యాన్ని పరిచయం చేసి ప్రోత్సహించేందుకు కన్నడ సంఘాల కార్యకర్తలు ఐక్యతతో ముందుకు రావాలని మైత్రి కన్నడ సాహిత్య వేదిక అధ్యక్షుడు ఎస్.రామలింగేశ్వర పిలుపునిచ్చారు. కన్నడ సాహిత్య పరిషత్ ఆవరణలో వేదికె పధాధికారులు మొదటి సాహిత్య సమ్మేళనాన్ని ఆదివారం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ బెంగళూరుతో పాటు, రాష్ట్ర వ్యాప్తంగా ప్రతివీధికి ఒక కన్నడ సంఘం ఉందని, ఒక్కో సంఘం ఒక్కో ఆలోచనలతో పని చేస్తుందని చెప్పారు. కన్నడ సీమలో ఉంటున్న ప్రతి ఒక్కరూ కన్నడ నేర్చుకోవాలని కోరుకోవడం తప్పు కాదన్నారు. విద్య వ్యాపారంగా మారిన ఈ కాలంలో ఉచితంగా కన్నడ భాషను బోధించడం గొప్ప విషయమని అన్నారు. ఉచిత విద్య, వైద్య శిబిరం, సేవలను అందించే సంస్థలకు తాము మద్దతుగా నిలుస్తామన్నారు. రాజకీయ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని కొన్ని సంఘాల పధాధికారులు కర్ణాటకను రెండుగా విభజించాలనే అంశాన్ని తెరపైకి తీసుకువచ్చారని మండిపడ్డారు. కుటుంబ పాలన వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటం చేసేందుకు కన్నడిగులు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు. కార్యక్రమంలో కన్నడ పుస్తక ప్రాధికార మాజీ అధ్యక్షుడు బంజెగెరె జయప్రకాశ్, కర్ణాటక గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు వోడే పి.కృష్ణ, కర్ణాటక సాహిత్య అకాడమీ అధ్యక్షుడు భైరమంగల రామేగౌడ తదితరులు పాల్గొన్నారు.



పుస్తకాలను పరిశీలిస్తున్న కన్నడ సంఘాల ప్రతినిధులు

ఆంధ్రజ్యోతి సోమవారం 30 జూలై 2018


మొక్కకు నీరు పోస్తూ...

**బెంగళూరు, జూలై 29 (ఆంధ్రజ్యోతి):** సమాజంలో మానవతా విలువలు తగ్గిపోతున్నాయని నిజాయితీ, నిస్వార్థపరుల సంఖ్య క్షీణిస్తోందని ఇది మంచి పరిణామం కాదని మాజీ మంత్రి హెచ్‌కే పాటిల్ విచారం వ్యక్తం చేశా రు. ఆదివారం గాంధీ స్మారక నిధి గాంధీ భవన్‌లో ఏర్పాటు చేసిన గాంధేయవాది డాక్టర్ హెచ్‌ఎస్ దొరస్వామి వందవ సంబరాన్ని లాంఛనంగా ప్రారంభించారు. స్వాతంత్ర్య సమరయోధుడు దొరస్వామి, లలితమ్మ దంపతులను ఈ సందర్భంగా ఘనంగా సత్కరించారు. కేంద్రమాజీ మంత్రులు ఎంవీ రాజశేఖరన్, జాఫర్ షరీఫ్, ఎమ్మెల్యే ఎ.టి.రామస్వా మి, సాహితీవేత్త హంపానాగరాజయ్య, గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు ఉడే కృష్ణలు, రిటైర్డు న్యాయమూర్తి రామాజోయిస్‌లు పాల్గొన్నారు. ఈ సందర్భంగా హెచ్.కె.పాటిల్ మాట్లాడుతూ నేటి యువత జాతి రక్షణ పట్ల బాధ్యులుగా ఉండాలని, వ్యక్తిగత స్వార్థాలను తగ్గించుకోవాలని సూచించారు. ప్రస్తుత సమాజాన్ని గమనిస్తే ఎటువైపు వెడుతోందో... అర్థం కావడం లేదన్నారు. గాంధీ మార్గంలో నేటి ప్రజా ప్రతినిధులు వెడుతున్నారా...? అనేది అనుమానం కలిగిస్తోందన్నారు. నిజాయితీ పరులను, క్రమశిక్షణతో ఎదిగినవారి సాధనలను తరచూ సమాజానికి తెలియజేయాల్సిన బాధ్యత ఉందన్నారు. ప్రస్తుతం రాజకీయాల్లో పదవులు వస్తాయంటే విలువలకు పక్కనబెట్టి పోయేవారు అధికమయ్యారని విచారం వ్యక్తం చేశారు. పేదరికంలోనే ఉన్నా నైతిక విలువలకు ఎంతోమంది ప్రాధాన్యత ఇచ్చారని అటువంటివారిలో దొరస్వామి ఒకరన్నారు. దొరస్వామి, కెంగల్ హనుమంతయ్యలు ఎమ్మెల్సీ పదవులను వీడే సందర్భంలోనూ నైతిక విలువలకే ప్రాధాన్యం ఇచ్చారన్నారు. గాంధీ తత్వాలు సమాజానికి మరింత చేరువ చేసేలా స్వచ్ఛంద సం స్థలు పనిచేయాలని పిలుపునిచ్చారు. ఇదే సం దర్భంగా దొరస్వామిని ఉద్దేశించి రచించిన 'గాళిగె సిక్క తెరగళు' పుస్తకాన్ని లాంఛనంగా ఆవిష్కరించారు. యువత సమాజాభివృద్ధికి పాటుపడాలని, మానవత్వ విలువలే సమాజానికి పట్టుగొమ్మలన్నారు. పలువురు ప్రముఖులు కార్యక్రమంలో పాల్గొన్నారు.


స్వాతంత్ర్య సమరయోధుడు దొరస్వామి దంపతులకు సన్మానం

సాక్షి

కర్ణాటక | సోమవారం |
జూలై | 30 | 2018

# నిస్వార్థుల సంఖ్య తగ్గిపోయింది

- మాజీ మంత్రి హెచ్‌కే పాటిల్
- ఘనంగా స్వాతంత్ర్య సమరయోధుడి జన్మదిన వేడుకలు
- 100 ఏళ్లు పూర్తి చేసుకున్న డాక్టర్ హెచ్‌ఎస్ దొరస్వామి



**దొరస్వామిని సన్మానిస్తున్న దృశ్యం**

సాక్షి బెంగళూరు, శివాజీనగర: సమాజంలో నిస్వార్థ పరుల సంఖ్య గణనీయంగా తగ్గిపోయిందని మాజీ మంత్రి, ఎమ్మెల్యే హెచ్‌కే పాటిల్ ఆవేదన వ్యక్తం చేశారు. ఆదివారం బెంగళూరు నగరంలోని గాంధీభవన్‌లో స్వాతంత్ర్య సమరయోధుడు డాక్టర్ హెచ్‌ఎస్ దొరస్వామి 100వ జన్మదిన వేడుకలు ఘనంగా నిర్వహించారు. కార్యక్రమానికి మాజీ మంత్రి హెచ్‌కే పాటిల్ ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఈసందర్భంగా ఆయన మాట్లాడుతూ... ప్రస్తుత సమాజంలో నిస్వార్థంగా సేవలు అందించే వారు కరువయ్యారన్నారు. నవ సమాజంలో గాంధీమార్గంలో నడిచే వారు కనిపించడం లేదన్నారు. ప్రస్తుత సమాజ స్థితిగతులు ఏంటో తనకు అర్థం కావడం లేదని చెప్పారు.

**దొరస్వామిని ఆదర్శంగా తీసుకోవాలి**

దేశం కోసం పోరాడిన దొరస్వామిని ప్రతి ఒక్కరు ఆదర్శంగా తీసుకోవాలని సూచించారు. దొరస్వామి నిజమైన గాంధేయవాది అన్నారు. దొరస్వామిని ఆదర్శంగా తీసుకుని గ్రామాల్లో అనేక సేవా కార్యక్రమాలు చేయాలన్నారు. అనేక పోరాటాలు, ఉద్యమాల్లో పాల్గొన్న దొరస్వామి ఎంతోమందికి ఆదర్శంగా నిలిచారని గుర్తు చేశారు. దొరస్వామి మాటలను అందరు స్ఫూర్తిగా తీసుకుని ముందుకు పోవాలని కోరారు. ఈసందర్భంగా 100 ఏళ్లు పూర్తి చేసుకున్న దొరస్వామిని ఆయన భార్య లలితమ్మను గాంధీభవన్‌లో ఘనంగా సన్మానించారు. కార్యక్రమంలో కేంద్ర మాజీ మంత్రులు రాజశేఖరన్, సీకే జాఫర్ షరీఫ్, ఎమ్మెల్యే ఏటీ దొరస్వామి, మాజీ ఎంపీ హనుమంతప్ప, గాంధీభవన్ స్మారక నిధి అధ్యక్షుడు పి.కృష్ణ, విశ్రాంత న్యాయమూర్తి రామజోయిస్ తదితరులు పాల్గొన్నారు.

# ప్రశ్నించే తత్వమే ఓ ఆయుధం

## యువతకు దొరెస్వామి పిలుపు



స్వాతంత్ర్య సమరయోధుడు దొరెస్వామిని సత్కరిస్తున్న పాటిల్, రాజశేఖర్‌మూర్తి

**బెంగళూరు (యశ్వంతపుర), న్యూస్‌టుడే :** సమస్యలపై నిరంతర పోరాటాలతో ప్రజాజీవనంలో మమేకమైన స్వాతంత్ర్య సమరయోధుడు దొరెస్వామి సేవలు నిరుపమానమని మాజీ మంత్రి హెచ్.కె.పాటిల్ కీర్తించారు. ప్రజాపక్షపాతిగా సమకాలీన చరిత్రలో చెరగని గుర్తింపు తెచ్చుకున్నారని శ్లాఘించారు. బెంగళూరు గాంధీభవన్‌లో ఆదివారం దొరెస్వామి శతమానోత్సవాలు (వందవ పుట్టిన రోజు) ఘనంగా నిర్వహించారు. కార్యక్రమంలో పాటిల్ మాట్లాడుతూ మహాత్మాగాంధీ సిద్ధాంతాలతో దొరెస్వామి ఎంతో బలవంతుడిగా ఎదిగారని, బాపూజీ మార్గంలో నడుస్తూ నేటి తరానికి ఆదర్శంగా నిలిచారన్నారు. ఆయన జీవిత చరిత్ర నేటి యువతకు మార్గదర్శనమని విశ్లేషించారు. అదొక పాఠ్యాంశంగా విద్యార్థులకు ప్రవేశపెట్టాలని అభిప్రాయపడ్డారు. అక్టోబరు రెండున దొరెస్వామి జీవిత చరిత్ర అందరికీ తెలియజేసే విధంగా కార్యక్రమాలను చేపట్టాలని పిలుపునిచ్చారు. కర్ణాటక గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు డాక్టర్ వూడె పి.కృష్ణ మాట్లాడుతూ స్వాతంత్ర్య పోరాటానికి ప్రతిరూపంగా దొరెస్వామి నేటికీ సమాజ సేవ చేస్తున్నారని కొనియాడారు. ఆయన.. నిత్య ఉద్యమకారుడు, జీవితం.. నేటి యువతకు ఆదర్శమన్నారు. రాజకీయాలకు దూరంగా ఉంటూ- సమాజ హితమే లక్ష్యంగా పోరాట మార్గం ఎంచుకోవడం అపురూపంగా పేర్కొన్నారు. కేంద్ర మాజీ మంత్రి సీకే జాఫర్ షరీఫ్ మాట్లాడుతూ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని కష్టపడిన సమరయోధులు ఒక్కొక్కరు కాలం తీరుతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. స్వార్థరహితంగా దేశం కోసం త్యాగం చేశారని దొరెస్వామిని మెచ్చుకున్నారు. నేటి రాజకీయ నాయకులు మాత్రం అందుకు వ్యతిరేకమని, వీరందరికీ స్వార్థం- సంపదన రెండు కళ్లుగా మారాయని ధ్వజమెత్తారు. నైతిక విలువల్ని ఎవరూ ఆచరించడంలేదంటూ మండిపడ్డారు. గాంధీ గురించి నేటి రాజకీయ నాయకులకు ఎంత మందికి తెలుసని ప్రశ్నించారు. సన్మానాన్ని స్వీకరించిన దొరెస్వామి మాట్లాడుతూ నేడు దేశ పరిస్థితుల్ని చూస్తుంటే ఇందుకోసమేనా బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా పోరాటం చేశామనే ఆవేతన కలుగుతోందన్నారు. ప్రశ్నించే తత్వాన్ని నేటియువతలో లేకుండా చేస్తున్నారని ఆందోళన వ్యక్తం చేశారు. ప్రశ్నించే తత్వమే మహా ఆయుధమని- అది లేకుంటే వ్యవస్థ ముందుకు సాగదని హెచ్చరించారు. గాంధేయ మార్గానికి అదే అసలైన పునాదిగా పేర్కొన్నారు. కార్యక్రమంలో కేంద్ర మాజీ మంత్రి ఎం.వి.రాజశేఖరన్, కన్నడ అభివృద్ధి ప్రాధికార అధ్యక్షుడు ఆచార్య సిద్ధరామయ్య పాల్గొన్నారు.

వార్త
గురువారం 12 । జూలై । 2007 । అనంతపురం




ప్రపంచ జనాభా దినోత్సవం సందర్భంగా రెడ్‌క్రాస్ సొసైటి నిర్వహించిన కార్యక్రమంలో పాల్గొన్న కన్నడ సినీనటి జయంతి, రాజ్యసభ మాజీ సభ్యురాలు బింబారాయ్కర్

ఆంధ్రజ్యోతి
మంగళవారం 12 జూన్ 2018



సీఎం కుమారస్వామికి గాంధీ విగ్రహం బహూకరిస్తున్న దృశ్యం

# అవినీతిపై యువత పోరాడాలి





జాతిపిత మహాత్మాగాంధీ విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పిస్తున్న అన్నాహజారే, విద్యార్థులతో ముచ్చటిస్తున్న దృశ్యం

- ఏసీ గదుల్లో నిద్రిస్తే సుఖం రాదు
- నలుగురి కష్టాలను పంచుకుంటేనే జీవితానికి సార్థకత
- మొక్కలు పెంచి పర్యావరణ పరిరక్షణకు పాటు పడాలి
- స్వామి వివేకానంద స్ఫూర్తితో సమాజ సేవ
- అన్నా హజారే

యలహంక :

అభివృద్ధి, అవినీతి రహిత సమాజ నిర్మాణానికి యువత ముందుకు రావాలని ప్రముఖ సమాజ సేవకుడు అన్నా హజారే పిలుపు ఇచ్చారు. యలహంకలోని శేషాద్రిపురం కళాశాలలో బుధవారం జరిగిన సిల్వర్ జూబ్లీ ఉత్సవాల్లో ఆయన పాల్గొని మాట్లాడారు. యువత మత్తు, మాదకద్రవ్యాలకు బానిసలై విలువైన జీవితాన్ని కోల్పోతున్నారన్నారు. మత్తువల్ల జరిగే అనర్థాలను గుర్తించలేక పోతున్నారన్నారు. అన్ని జీవుల్లోకి మనిషి జన్మ ఎంతో ఉత్తమమైనదని, దీనిని మంచి కార్యాలకు ఉపయోగించాలన్నారు. ఏసీ గదుల్లో నిద్రించిన మాత్రాన సుఖం రాదని, నలుగురి కష్టాలను పంచుకొని అండగా నిలిచినప్పుడే జీవితానికి సార్థకత లభిస్తుందన్నారు. మానవసేవే మాధవ సేవ అనే నానుడితో యువత మెలగాలన్నారు. తల్లిదండ్రులు తమ పిల్లలపై ఎన్నో ఆశలు పెంచుకొని ఉంటారని, ఎంచుకున్న లక్ష్యాన్ని సాధించి వారి కలలు సాకారం చేయాలన్నారు. సంపద కోసం పరుగులు తీయకుండా సేవాభావంతో మెలగాలన్నారు. పెట్రోల్, డీజిల్ వాహనాలతో వాతావరణంలో కాలుష్యం పెరిగిపోయి హిమాలయాల్లో మంచు కరిగి ప్రకృతి వైపరీతాలు ఏర్పడుతాయని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారన్నారు. ఈ నేపథ్యంలో ప్రతి ఒక్కరూ మొక్కలు నాటి కాలుష్య నివారణకు కృషి చేయాలన్నారు. 25 సంవత్సరాల క్రితం తాను స్వామి వివేకనంద సందేశాలు చదివానని, అప్పటినుంచే నా ఊరు, నా ప్రాంతం, నా ప్రజలు అనే సేవా తత్వం ఏర్పడిందన్నారు. దేశ ప్రజలే తన కుటుంబంగా భావించి తినడానికి రోటి, కప్పు కోవడానికి దుప్పటి ఉంటే చాలని భావించి సమాజ సేవకు అంకితమయ్యాయనన్నారు. ప్రభుత్వం అవార్డు రూపంలో ఇచ్చిన నగదును ట్రస్టు ద్వారా ప్రజా సంక్షేమానికి ఖర్చు చేయనున్నట్లు ప్రకటించారు. విద్యార్థులు చదువులు పూర్తయిన తర్వాత సొంతంగా పరిశ్రమలు ఏర్పాటు చేసి పదిమందికి ఉపాధి కల్పించాలన్నారు.

ఆంధ్రజ్యోతి బుధ వారం 13-8-2014

# ఘనంగా విక్రమ్‌సారాభాయ్ జయంతి



నివాళులు అర్పిస్తున్న విద్యార్థులు, ముఖ్యులు

ఆంధ్రజ్యోతి ప్రతినిధి, బెంగళూరు: అంతరిక్ష పరిశోధనలతో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన శాస్త్రవేత్త డాక్టర్ విక్రమ్‌సారాభాయ్ జయంతి కార్యక్రమాన్ని నగరంలో మంగళవారం ఘనంగా నిర్వహించారు. అగస్త్య ఇంటర్నేషనల్ ఫౌండేషన్, ఇండియన్ స్పేస్ రీసెర్చ్ ఆర్గనైజేషన్, ది ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ ఆక్యుపెజర్ అకాడమీలు సంయుక్తంగా జయంతి కార్యక్రమాన్ని ఇక్కడి విశ్వేశ్వరయ్య ఆ డిటోరియంలో ఏర్పాటు చేశాయి. ఇస్రో మంగళయాన్ ప్రాజెక్టు డిప్యూటీ డైరెక్టర్ సతీశ్ ఈ సందర్భంగా మాట్లాడుతూ అంతరిక్ష పరిశోధనలకు డాక్టర్ విక్రమ్ సారాభాయ్ గట్టి పునాదులు వేశారని కొనియాడారు. ఈ బలమైన పునాదుల ఆధారంగానే మంగళయాన్ ప్రాజెక్టును చేపట్టగలిగామన్నారు. సెప్టెంబర్ 24 నాటికి మంగళయాన్ ప్రా జెక్టు కీలక దశకు చేరుకోనుందని చెప్పారు. ఇస్రో మాజీ శాస్త్రవేత్త పద్మశ్రీ ఆర్.ఎం.వాసగమ్ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. అగస్త్య ఇంటర్నేషనల్ సంస్థ అధ్యక్షుడు అజిత్ బాసుతోపాటు పలువురు శాస్త్రవేత్తలు, విద్యార్థులు, పాల్గొన్నారు.

ఈనాడు కర్ణాటక
బుధవారం 31 ఆగస్టు 2016

# 'గాంధీ భవనాల నిర్మాణంలో జాప్యం తగదు'

**బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే:** అన్ని జిల్లా కేంద్రాల్లో గాంధీ భవనాల్ని నిర్మించేందుకు చర్యలు తీసుకుంటామని ప్రకటించిన ప్రభుత్వం ఇప్పటి వరకు ఆ హామీ నెరవేర్చలేదని ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు హెచ్.ఎస్.దొరెస్వామి ఆక్షేపించారు. గాంధీ భవనాల నిర్మాణం కోసం గత బడ్జెట్‌లో నిధులు కేటాయించినా ఇప్పటి వరకు పనులు ప్రారంభించలేదని విమర్శించారు. ఆయా బడ్జెట్లలో కేటాయించిన నిధుల్ని అదే ఏడాది ఖర్చు చేయవలసి ఉండగా, ప్రభుత్వం ప్రస్తుతం ఉద్దేశపూర్వకంగా కాలహరణం చేస్తోందని ధ్వజమెత్తారు. ముఖ్యమంత్రి సిద్ధ రామయ్యను ఆయన నివాస కార్యాలయంలో గాంధేయవాదులు, స్వాతంత్ర్య సమరయోధులు, సాహితీవేత్తలు మంగళవారం కలుసుకున్నారు. గాంధీ భవనాలను ఎంత విస్తీర్ణంలో నిర్మించాలి? అక్కడ ఎటువంటి సదుపాయాలు కల్పించాలి? భవంతుల స్వరూపం ఎలా ఉండాలి? తదితర అంశాల గురించి వారంతా సిద్ధరామయ్యకుసూచనలు చేశారు. గాంధీ భవంతుల నిర్మాణానికి త్వరలో నిధులు విడుదల చేస్తామని వారికి సిద్ధరామయ్య హామీ ఇచ్చారు. ముఖ్యమంత్రిని కలుసుకున్న వారిలో గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు ఆచార్య శ్రీనివాసయ్య, వూడె పి.కృష్ణ, సీనియరు పాత్రికేయుడు పాటిల్ పుట్టప్ప, సుమంగళి సేవాశ్రమ వ్యవస్థాపకురాలు పి. సుశీలమ్మ, పర్యావరణవేత్త యల్లప్ప రెడ్డి, సాహితీవేత్తలు బరగూరు రామచంద్రప్ప, ఎస్.సి.సిద్ధరామయ్య, అధికారులు లక్ష్మీనారాయణ, విశుకుమార్ తతదితరులు ఉన్నారు.



గాంధేయవాదులు, స్వాతంత్ర్య సమరయోధులతో సమావేశమైన ముఖ్యమంత్రి సిద్ధరామయ్య

# 'గాంధీ'తత్వమే సరైనది

## ముఖ్యమంత్రి సిద్ధరామయ్య

సాక్షి, బెంగళూరు: ప్రపంచంలోని అవినీతి, అశాంతి నివారణకు 'గాంధీ' తత్వాన్ని అనుసరించడమే సరైన మార్గమని ముఖ్యమంత్రి సిద్ధరామయ్య పేర్కొన్నారు. మహాత్మాగాంధీజీ బెంగళూరు నగరంలో తొలిసారిగా అడుగుపెట్టి శుక్రవారంతో వందేళ్లు పూర్తయిన సందర్భంగా నగరంలోని జ్ఞానజ్యోతి ఆడిటోరియంలో నిర్వహించిన కార్యక్రమంలో సిద్ధరామయ్య పాల్గొన్నారు. ఈ సందర్భంగా సిద్ధరామయ్య మాట్లాడుతూ....కుల, మతాల పేరిట సమాజంలో కల్లోలాన్ని సృష్టించే కుట్ర ప్రస్తుతం జరుగుతోందని ఆవేదన వ్యక్తం చేశారు. కేవలం భారతదేశంలోనే కాక ప్రపంచమంతటా ఈ తరహా పరిణామాలు చోటు చేసుకుంటున్నాయని పేర్కొన్నారు. అందువల్ల ప్రస్తుతం ప్రపంచమంతా గాంధీజీ చూపిన సత్య, అహింసా మార్గాల్లో నడవాల్సిన అవసరం ఎంతైనా ఉందని అన్నారు. గాంధీజీ తన జీవితాంతం సత్యం, అహింసలను పాటించడంతో పాటు సమానతా భావాన్ని పెంపొందిస్తూ వచ్చారని,



కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న ప్రముఖులు

తమ ప్రభుత్వం కూడా ఇదే బాటలో నడుస్తోందని అన్నారు. బెళగావిలో నిర్వహించిన కాంగ్రెస్ మహాసభలో గాంధీజీ పాల్గొన్నారని, తద్వారా కర్ణాటకతో గాంధీజీకి అవినాభావ సంబంధం ఏర్పడిందని తెలిపారు. ఇక మేకిన్ ఇండియా పేరిట విదేశీ సంస్థల నుంచి పెట్టుబడులు భారత్‌కు తీసుకొస్తున్నారని, తద్వారా భారత్‌లో అభివృద్ధి జరుగుతుందని ప్రజలను మభ్య పెడుతున్నారని విమర్శించారు. కార్యక్రమంలో మంత్రులు రోషన్‌బేగ్, హెచ్.కె.పాటిల్, ఉమాశ్రీ తదితరులు పాల్గొన్నారు.

# కనుమరుగవుతున్న గాంధేయవాదం

◆ అధికారుల్లో ధనదాహం, పెరిగిన అవినీతి ◆ ముఖ్యమంత్రి హెచ్.డి.కుమారస్వామి



వేదికపై కుమారస్వామి

**బెంగళూరు (శివాజీనగర్), న్యూస్‌టుడే:** "గత నెలరోజులుగా అధికారులను గమనిస్తూ వస్తున్నా.. ఎక్కువ మందిలో ధనదాహం ఉంది. దాన్ని సరిచేసేందుకు ముందుకు రావాలంటేనే భయం వేస్తోంది. వ్యవస్థ పూర్తిగా పాడైపోయిందని" ముఖ్యమంత్రి హెచ్.డి.కుమారస్వామి ఆందోళన వ్యక్తం చేశారు. గాంధీభవన్‌లో సీనియర్ గాంధేయవాదుల నుంచి ఆయన సోమవారం సన్మానం అందుకున్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ.. బదిలీ ప్రక్రియల నుంచి ప్రారంభమయ్యే అవినీతి, అన్ని పథకాల జారీ వరకు కొనసాగుతోందని చెప్పారు. ఒక్క బదిలీకి రూ. 5 లక్షల నుంచి రూ. 10 లక్షల వరకు ఉంటుందని తెలిపారు. ఈ అవినీతి వ్యవస్థను ఎక్కడి నుంచి సరిచేయాలనే అంశం ఇప్పటివరకు తనకు తట్టలేదన్నారు. తనకు రెండోసారి ముఖ్యమంత్రిగా అవకాశం రావటం దైవ నిర్ణయమే. భాజపాతో కలిసి సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తానని ఎక్కువ మంది భావించారు. భాజపా నుంచి కూడా తనకు ఆఫర్లు వచ్చాయని తెలిపారు. సంకీర్ణ ప్రభుత్వం ఐదేళ్ల పాటు కొనసాగదని పలు పత్రికలు, ఛానెళ్లలో వస్తున్న వార్తలను గమనిస్తున్నా.. ఈ ప్రభుత్వం ఐదేళ్ల పాటు తన పాలనలో కొనసాగుతుందని ధీమా వ్యక్తం చేశారు. త్వరలో పూర్తిస్థాయిలో జనతాదర్శనలను నిర్వహిస్తానని చెప్పారు. తాను వ్యక్తిగత పనిపై ఆదివారం మైసూరుకు వెళ్లిన సందర్భంలో అక్కడ కూడా కొందరు దివ్యాంగులు వచ్చారు. తాను వారిని కలిసేందుకు సాధ్యం కాకపోతే, దాన్ని కూడా పత్రికల్లో తప్పుగా రాశారని, తనకు మానవత్వం లేదని పేర్కొన్నారని ఆవేదన వ్యక్తం చేశారు. పాత్రికేయులే నగదు ఇచ్చి, తమ మానవత్వాన్ని ప్రదర్శించుకోవచ్చుకదా అని విమర్శించారు. టీఆర్‌పీల కోసం తప్పుడు వార్తలు చూపించవద్దని విజ్ఞప్తి చేశారు.

● సంకీర్ణ ప్రభుత్వంలో నాకు ఇష్టం లేకపోయినా, అనివార్య పరిస్థితుల్లో ముఖ్యమంత్రి కావాల్సి వచ్చిందని కుమారస్వామి తెలిపారు. జేడీఎస్ జాతీయ అధ్యక్షుడు దేవేగౌడపై కాంగ్రెస్ పార్టీ నాయకులు ఒత్తిడి తీసుక రావటంతోనే తాను ముఖ్యమంత్రిని అయ్యానని చెప్పారు. తనకు రెండుసార్లు హృద్రోగ శస్త్రచికిత్స జరిగిందని, ఒత్తిడితో పని చేయకూడదని దేవేగౌడ చెప్పినా, కాంగ్రెస్ పార్టీ నాయకుల ఒత్తిడితో అంగీకరించామని తెలిపారు. మానవీయతా విలువలు, గాంధేయ వాదం కనుమరుగవుతోందని ఆవేదన వ్యక్తం చేశారు. అన్ని జిల్లాల్లో గాంధీభవన నిర్మాణానికి ప్రభుత్వం సహకారాన్ని అందిస్తుందని హామీ ఇచ్చారు.



హాజరైన గాంధేయవాదులు, మాజీ మంత్రి బి.టి.లలితా నాయక్

# లైంగిక దాడులకు అడ్డుకట్ట పడాలి

## నోబెల్ శాంతి పురస్కార గ్రహీత కైలాస్ సత్యార్థి

జయనగర :

దేశంలో చోటుచేసుకుంటున్న లైంగిక దాడులకు అడ్డుకట్ట వేసేందుకు ప్రభుత్వాలు చర్యలు చేపట్టాలని నోబెల్ శాంతి పురస్కారగ్రహీత కైలాస్‌సత్యార్థి సూచించారు. యలహంక శేషాద్రిపుర డిగ్రీ కాలేజీలో భారతీయవిజ్ఞానసంస్థ ఆధ్వర్యంలో గురువారం ఏర్పాటు చేసిన సిల్వర్‌జూబ్లీ టాక్‌లో కైలాస్‌సత్యార్థి పాల్గొని మాట్లాడారు. వివిధ యూనివర్సిటీల్లో విద్యార్థినులపై జరిగే లైంగిక దాడులను బాధితులు బయటకు చెప్పుకోలేక పోతున్నారన్నారు. తల్లిదండ్రులు స్నేహభావంతో మెలిగి పిల్లల సమస్యలు తెలుసుకోవాలన్నారు. నేటికి కోట్లాదిమంది పిల్లలు ఆకలితో అలమటిస్తున్నారని, దుస్తులు, పాఠ్యపుస్తకాల కొనుగోలుకు డబ్బు లేక చదువులకు దూరమవుతున్నారన్నారు. ప్రపంచంలో 152 మిలియన్ల పిల్లలు బాలకార్మికులుగా ఉన్నారన్నారు. వారికి విముక్తి కల్పించాల్సిన బాధ్యత అందరిపై ఉందన్నారు.



విద్యార్థులతో కరచాలనం చేస్తున్న కైలాస్ సత్యార్థి

యువత కొత్త ఆలోచనలతో ముందుకు సాగాలన్నారు. పరిశోధనలకు ప్రాధాన్యత ఇవ్వడంతోపాటు బోధన రంగంలో ఉన్నత పదవులు అలంకరించాలన్నారు. అనంతరం కళాశాల యాజమాన్యం కైలాస్ సత్యార్థిని ఘనంగా సన్మానించింది. డీఆర్‌డీఏ మాజీ అధ్యక్షుడు డాక్టర్ వీకే.అత్రే, ఐఐఎస్సీ మాజీ డైరెక్టర్ ప్రొ.బలరామ్, సంస్థ గౌరవకార్యదరి డాక్టర్ వూడే పీ.కృష్ణ, డాక్టర్ ఎంపీ .రవీంద్ర, శేషాద్రిపురం ఎడ్యుకేషనల్ ట్రస్ట్ అధ్యక్షుడు ఎన్ఆర్.పండితారాధ్య తదితరులు పాల్గొన్నారు.

ఆంధ్రజ్యోతి

శనివారం 07 ఏప్రిల్ 2018



శేషాద్రిపురం ఎడ్యుకేషనల్ ట్రస్టు నిర్వహణలోని ఫస్ట్ గ్రేడ్ కళాశాల రజతోత్సవాలకు ధర్మస్థళ ధర్మాధికారి డా.వీరేంద్రహెగ్డే శుక్రవారం ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ట్రస్టు చైర్మన్ ఎన్.ఆర్.పండితారాధ్య పాల్గొన్నారు. పలు సాంస్కృతిక కార్యక్రమాలు ఆకట్టుకున్నాయి.

 

# యువతరానికి దూరదృష్టి అవసరం



కార్యక్రమంలో డాక్టర్ వీరేంద్ర హెగ్గడే, డాక్టర్ వూడే కృష్ణ, పండితారాధ్య తదితరులు

బెంగళూరు (యలహంక), న్యూస్‌టుడే: దేశం వ్యవసాయం, పరిశ్రమల రంగంలో ముందంజలో ఉందని, నేటి యువత దానికి అనుగుణంగా దూర దృష్టితో ప్రణాళికలను రూపొందించుకోవాలని ధర్మ స్థల ధర్మాధికారి డాక్టర్ డి.వీరేంద్ర హెగ్గడే పిలుపు నిచ్చారు. శుక్రవారం ఇక్కడ యలహంకలోని శేషా ద్రిపురం పీయూసీ కళాశాల వార్షికోత్సవాల్ని ఆయన ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లా డుతూ దేశాభివృద్ధికి నేటి యువత శ్రమించాలని పిలుపునిచ్చారు. సమయస్ఫూర్తి, అవకాశాల్ని సద్విని యోగం చేసుకుని ముందుకు రావాలని సూచిం చారు. ధైర్యం, ఆత్మవిశ్వాసం పెంచుకోవాలని మంచి వ్యక్తిత్వాన్ని రూపొందిం చుకుని బలమైన భారత్‌ను నిర్మించాలని ఆకాంక్షిం చారు. యువతకు లక్ష్యం లేకపోతే దేశానికి భవి ష్యత్తు లేదన్నారు. విదే శాల అభివృద్ధి వెనక ఆ దేశ నేతల త్యాగాలు ఉన్నట్లు గుర్తు చేశారు. చదు వుతో పాటు విద్యార్థులు ఇతర కార్యక్ర మాల పట్ల ఆసక్తి చూపించా లని నైతిక విలువల గురించి నేటి తరానికి శిక్షణ ఇవ్వాల్సిన అవసరం ఉందన్నారు. మహాత్మాగాంధీ, స్వామి వివేకానంద ఆదర్శాల్ని విద్యార్థులు పాటించాలని హితవు పలికారు. కార్య క్రమంలో శేషాద్రిపురం విద్యాసంస్థ గౌరవ ప్రధాన కార్యదర్శి డాక్టర్ వూడే కృష్ణ, అధ్యక్షుడు ఎన్.ఆర్.పండితా రాధ్య, ఉపాధ్యక్షుడు హెజారప్ప, ప్రిన్సిపాల్ డాక్టర్ వెంకటేష్ తదిత రులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా విద్యార్థులు నిర్వహించిన వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు అలరిం చాయి.


సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహించిన విద్యార్థులు

ఆంధ్రజ్యోతి సమాచారం కర్ణాటక • శనివారం 20 జనవరి 2018

# విద్యార్జనతో పాటు ఆవిష్కరణలూ ఊపందుకోవాలి

## » దేశ్‌పాండే ఫౌండేషన్ అధ్యక్షుడు గురురాజ్ దేశ్‌పాండే

**శేషాద్రిపురం, జనవరి 19:** ప్రస్తుత పోటీ ప్రపంచంలో నిలదొక్కుకోవాలంటే విద్యార్థులు రొటీన్ విద్యార్జనతో పాటు ఆవిష్కరణలపై దృష్టిని సారించాలని దేశ్‌పాండే ఫౌండేషన్ అధ్యక్షుడు గురురాజ్ దేశ్‌పాండే పేర్కొన్నారు. శేషాద్రిపురం ఫస్ట్‌గ్రేడ్ కాలేజీ సిల్వర్ జూబ్లీ వేడుకలో భాగంగా శుక్రవారం ఏర్పాటైన కార్యక్రమానికి ఆయన ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. విద్యాభ్యాసమంటే మా ర్కులు, ర్యాంకులు మాత్రమే కాదన్నారు. వి ద్యార్థులు సామాజిక స్పృహను, వ్యక్తిత్వ వికాసాన్ని కూడా గణనీయంగా పెంచుకోవాలని హితవు పలికారు. సాంకేతిక పరిజ్ఞానం పు ణ్యమా అని ప్రపంచం మన అరచేతిలో ఉం దని దీన్ని సద్వినియోగం చేసుకోవాలని పిలుపునిచ్చారు.



రజతోత్సవంలో ప్రముఖులకు సన్మానిస్తున్న దృశ్యం

ఇన్వెంచర్స్ క్యాపిటల్ పార్టనర్ సలహాదారుడు ఎస్.జగదీష్, శేషాద్రిపురం విద్యాసంస్థ ప్రధాన కార్యదర్శి డా.వూడి పి.కృష్ణ, అధ్యక్షుడు ఎన్.ఆర్.పండితారాధ్య, ప్రిన్సిపాల్ డా. ఎస్.ఎన్.వెంకటేష్ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఈనాడు కర్ణాటక శనివారం 20 జనవరి 2018




గురుదేశ్‌పాండే, జగదీశ్‌లను సన్మానిస్తున్న అధికారులు

# ప్రాపంచిక జ్ఞానానికి ప్రాధాన్యం ఇవ్వాలి

**బెంగళూరు (శివాజీ నగర), న్యూస్‌టుడే:** పోటీ ప్రపంచంలో మార్కుల కన్నా, ప్రాపంచిక జ్ఞానానికి ప్రాధాన్యం ఇవ్వాలని దేశ్‌పాండే ఫౌండేషన్ అధ్యక్షుడు గురు దేశ్‌పాండే పిలుపునిచ్చారు. శేషాద్రిపురం కళాశాల రజతోత్సవాలను శుక్రవారం ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడారు. ఎక్కువ మార్కులు, ర్యాంకును సాధించిన తర్వాత ముఖాముఖికి వెళ్లినప్పుడు ప్రపంచంలోని పలు అంశాలు ప్రస్తావనకు వస్తాయని గుర్తు చేశారు. విద్యతో పాటు క్రీడలు, సంస్కృతి, సంప్రదాయాలపై విద్యార్థులు అవగాహన, అనుభవాన్ని పెంచుకోవాలని సూచించారు. నానాటికీ మారిపోతున్న సాంకేతికతను దృష్టిలో ఉంచుకుని, దానికి తగినట్లుగా విద్యార్థులు నేర్చుకునే విధానాల్లో మార్పు చేసుకోవాలని తెలిపారు. ఇన్వెంచర్ క్యాపిటల్ పారిశ్రామిక సలహాదారు ఎస్. జగదీశ్, శేషాద్రిపురం కళాశాల ప్రధాన కార్యదర్శి డా. వోడె పి. కృష్ణ, సంస్థ అధ్యక్షుడు పండితారాధ్య, యాజమాన్య ప్రతినిధులు శేష నారాయణ, డా. వెంకటేశ్, ఆచార్య సంతను దాస్ తదితరులు పాల్గొన్నారు.

# బెంగళూరు జోన్

్క కృతి

ఎల్. మల్లికార్జున
రాష్ట్ర ఒక్కలిగర
చారు. కర్ణాటక
ఖర్‌కు ఆయనకు
నిర్వహించారు.

రే

బెంగళూరు
నాట్యసరస్వతి
ప్రదర్శన నిర్వహి
సాంస్కృతిక కేం
నృత్య నాటక కా


కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న కృష్ణ తదితరులు



విద్యార్థుల నృత్య ప్రదర్శన

## ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలి

బెంగళూరు (కెంగేరి), న్యూస్‌టుడే: విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలని శేషాద్రిపురం శిక్షణ ట్రస్ట్ గౌరవ ప్రధాన కార్యదర్శి వుడే.పి.కృష్ణ పేర్కొన్నారు. శేషాద్రిపురం స్వతంత్ర పీయూ కళాశాల వార్షికోత్సవం వేడుకలు సుగ్గి-2017 కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ., శిక్షణ విద్యార్థులకు చక్కని భవిష్యత్తును రూపొందించేలా ఉపయోగపడాలన్నారు. మిమిక్రీ దయానంద్ మాట్లాడుతూ విద్యార్థులు క్రమశిక్షణతో మెలగాలని సూచించారు. ట్రస్ట్ సహకార్యదర్శి ఎస్.శేషనారాయణ్, ధర్మదర్శి కె.కృష్ణస్వామి, జి.ఆనంద, డిగ్రీ కళాశాల ప్రిన్సిపల్ డా.ఆర్.డి.సతీష్, దయానంద్, జయరామ్, విద్యార్థుల పోషకులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు ఆకట్టుకున్నాయి.

సాక్షి
కర్ణాటక | సోమవారం | డిసెంబర్ | 25 | 2017

# నాటి విజ్ఞానంతో నేటి విద్యా వికాసం

- బౌద్ధమత గురువు దలైలామా



**జ్యోతి వెలిగించి కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న దృశ్యం**

శివాజీనగర: ప్రాచీన భారతదేశ విజ్ఞానాన్ని ఆధునిక విద్యా పద్ధతిలోకి మార్చుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉందని ప్రముఖ బౌద్ధ మత గురువు దలైలామా పిలుపునిచ్చారు. ఆదివారం ఇక్కడ ప్యాలెస్ మైదానంలో శేషాద్రిపురం విద్యా సంస్థల రజతోత్సవంలో ఆయన పాల్గొని ప్రసంగించారు. ప్రాచీన భారతదేశ జ్ఞానంతో, గురువులతో ఎంతో జ్ఞానాన్ని పొందానని ఆయన తెలిపారు. ప్రాచీన జ్ఞానం చాలా అద్భుతమైనదని, ఆనాటి జ్ఞానాన్ని నేటి విద్యా విధానంలోకి మార్చుకోవాలని చెప్పారు. ప్రస్తుతం దేశంలో నెలకొన్న అనేక సమస్యలకు అహింస, కరుణ, లౌకికవాదం పరిష్కారాలని పేర్కొన్నారు. దేహ దారుఢ్యం సక్రమంగా ఉంటే జ్ఞానవృద్ధికి ఎంతో సహాయకారిగా ఉంటుందని తెలిపారు.

**ఆస్తికులతోనే ఘర్షణలు :** ప్రపంచంలో ఉన్న 7వందల కోట్ల జనాభాలో వంద కోట్ల మంది నాస్తికులు, మిగతా 6 వందల కోట్ల మంది ఆస్తికులని దలైలామా చెప్పారు. దేవుణ్ని నమ్మిన 6 వందల కోట్ల మంది మధ్య ఘర్షణలు జరుగుతున్నాయన్నారు. ఇందుకు కారణం ఆధ్యాత్మిక విధానాలే, ప్రపంచ ఐక్యత నెలకొనాలి అని పిలుపునిచ్చారు. విద్యార్థులు చెడు సహవాసాలకు దూరంగా ఉంటూ విద్యపై ఆసక్తి పెంచుకోవాలని సూచించారు. ఇస్రో చైర్మన్ ఏ.ఎస్.కిరణ్‌కుమార్ మాట్లాడుతూ నేటి అధునిక సాంకేతిక పరిజ్ఞానం దుర్వినియోగమవుతోందని విచారం వ్యక్తం చేశారు. విద్యా సంస్థల అధ్యక్షుడు ఎన్.ఆర్.పండితారాధ్య తదితరులు పాల్గొన్నారు.

భారతదేశ చరిత్ర

# మహానీయమైనది

## ఆధునికతలో ప్రాచీనతను అవలంబించాలి : దలైలామా
## - ఘనంగా శేషాద్రిపురం విద్యాసంస్థ రజతోత్సవం


జ్యోతి ప్రజ్వలన చేస్తున్న దలైలామా

ఆంధ్రజ్యోతి, బెంగళూరు: ప్రాచీనభారత విజ్ఞానాన్ని నేటి ఆధునిక విద్యావిధానంలోనూ అవలంబింపచేసే అవసరం ఉందని నోబుల్ పురస్కార గ్రహీత, బౌద్ధధర్మగురువు దలైలామా అభిప్రాయపడ్డారు. ఆదివారం బెంగళూరులోని త్రిపురవాసిని ప్యాలెస్‌లో శేషాద్రిపురం విద్యాసంస్థ రజతోత్సవంలో దలైలామా ముఖ్యులుగా పాల్గొన్నారు. ఇస్రో చైర్మన్ డా.కిరణ్‌కుమార్, శేషాద్రిపురం విద్యాసంస్థల గౌరవ కార్యదర్శి డాక్టర్ ఉడే. పి.కృష్ణ, అధ్యక్షుడు ఎన్.ఆర్.పండితారాధ్య తదితరులు పాల్గొన్నారు. విద్యార్థులు వారి తల్లిదండ్రులు శేషాద్రిపురం విద్యాసంస్థల ఉద్యోగులను ఉద్దేశించి దలైలామా మాట్లాడుతూ భారతదేశ చరిత్ర గొప్పదని తరతరాలుగా చరిత్రను ఇక్కడి విజ్ఞానాన్ని గురువులు బోధిస్తూ వచ్చారన్నారు. భారతీయ పురాతన జ్ఞానం అద్భుతమైనదని నేటి విద్యావిధానానికి అనుసంధానం చేసి బోధిస్తే ఉత్తమ ఫలాలు సాధ్యమన్నారు. ప్రస్తుతం ప్రపంచంలో అహింస, కరుణ, లౌకికవాదం ప్రధానమైనవన్నారు. దేహధారుడ్యం బాగుంటే ఆలోచించే శక్తి పెరుగుతుందన్నారు. మనం పొందిన జ్ఞానాన్ని మరొకరికి విస్తరింపచేయడం ద్వారా మేధాశక్తిని పంచాల్సి ఉంటుందన్నారు. వేదికపై దలైలామా, ఇస్రో చైర్మన్‌లకు శేషాద్రిపురం విద్యాసంస్థలనుంచి ఘన సత్కారం లభించింది.


ఇస్రో చైర్మన్ డా.కిరణ్‌కుమార్, బౌద్ధగురువు దలైలామాలకు సన్మానం

సోమవారం డిసెంబరు 25, 2017

ఈనాడు

# భారత గురువులే జ్ఞానసంపన్నులు: దలైలామా

బెంగళూరు (మల్లేశ్వరం), న్యూస్‌టుడే: ప్రాచీన భారత జ్ఞానాన్ని ఆధునిక శిక్షణ పద్ధతిలో అలవర్చుకోవాలని బౌద్ధమత గురువు దలైలామా పిలుపునిచ్చారు. భారత్‌లోని గురువుల నుంచి తాను అపరిమిత జ్ఞానాన్ని పొందానని గుర్తు చేసుకున్నారు. బెంగళూరులో శేషాద్రిపురం గ్రూపు విద్యాసంస్థల రజతోత్సవాల్లో భాగంగా ఆదివారం నిర్వహించిన కార్యక్రమంలో దలైలామా ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. నేటి ప్రపంచం ఎదుర్కొంటున్న పలు సమస్యలకు అహింస, కరుణ, ప్రజాస్వామ్య వ్యవస్థ పరిష్కారాలను చూపాయని తెలిపారు. పాశ్చాత్య సంస్కృతి, సంప్రదాయాలను అనుసరిస్తూ మన



మూలాల్ని, సంప్రదాయాలను నిర్లక్ష్యం చేయటం సరికాదన్నారు. ప్రతిఒక్కరూ దైహిక, మానసిక సామర్థ్యాలను వృద్ధి చేసుకుంటే, ఆ దేశంలో జ్ఞానాభివృద్ధి పెరిగి మరిన్ని చక్కని ఫలితాలు సాధించవచ్చన్నారు. జ్ఞానాన్ని ఇతరులతో పంచుకుంటేనే అది మరింత విస్తృతం అవుతుందన్నారు. కుల, మతాల అడ్డుగోడలను ఛేదించి, ప్రజలంతా ఒక్కటే అన్న భావన నెలకొన్నప్పుడు ప్రపంచంలో శాంతి నెలకొంటుందని తెలిపారు. ప్రస్తుత ప్రపంచం ఎదుర్కొంటున్న సమస్యలన్నింటికీ ప్రాచీన భారత గ్రంథాల్లో ఉత్తమ పరిష్కారమార్గాలు ఉన్నాయని గుర్తు చేశారు. పాఠశాల విద్యా వ్యవస్థలో ప్రాచీన విజ్ఞాన సంపత్తును పొందుపరచుకునేందుకు ఇదే సరైన సమయమన్నారు. విద్యార్థులు తమ జ్ఞానార్జనకు ఎక్కువ సమయం కేటాయిస్తూ, చెడు అలవాట్లకు దూరంగా ఉండాలని పిలుపునిచ్చారు. కార్యక్రమంలో భాగంగా దలైలామాతోపాటు ఇస్రో అధ్యక్షుడు డాక్టర్ కిరణ్‌కుమార్‌లను విద్యా సంస్థ ప్రతినిధులు డాక్టర్ వోడే పి. కృష్ణ, ఎన్. ఆర్. పండితారాధ్య తదితరులు సత్కరించారు.



పురస్కారం అందుకున్న దొరెస్వామి

# ఖాదీపై పన్ను తొలగించాలి

**బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే:** ఖాదీ ఉత్పత్తులపై వస్తువులు, సేవల తో పాటు అన్ని రకాల పన్నులను తొలగించాలని స్వాతంత్ర్య పోరాట యోధుడు దొరెస్వామి పిలుపునిచ్చారు. మహాత్ముని జయంతిని పురస్కరించుకుని ఈ ఏడాది గాంధీ పురస్కారాన్ని ప్రభుత్వం ఆయనకు అందించింది. రవీంద్ర కళాక్షేత్రలో సోమవారం రాత్రి ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ఆయన ముఖ్యమంత్రి సిద్ధరామయ్య చేతుల మీదుగా పురస్కారాన్ని అందుకుని మాట్లాడారు. గాంధీజీ కలలు గన్న స్వరాజ్యం ఇంకా సిద్ధించలేదని ఆవేదన వ్యక్తం చేశారు. సంపూర్ణ మద్య నిషేదం, స్వచ్ఛత, కుల, మతరహిత సమాజ నిర్మాణానికి ప్రతి ఒక్కరూ రాజకీయాలకు అతీతంగా పని చేయవలసిన అవసరం ఉందన్నారు. కార్యక్రమంలో దొరెస్వామి కుటుంబ సభ్యులు, మంత్రులు జార్జ్, రామలింగారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

గుర్తింపు కోసమే

# కన్నడ ధ్వజం

- జాతీయ పతాకంపై ఎనలేని గౌరవం
- ప్రతిపక్షాలది అనవసర రాద్ధాంతం
- కేపీసీసీ కార్యాధ్యక్షుడు దినేశ్‌గుండూరావు

అధికారికంగా కన్నడ ధ్వజానికి గుర్తింపు ఇవ్వాలన్న ఉద్దేశంతోనే ప్రత్యేక రాష్ట్రపతాక నిర్ణయం తీసుకున్నామని, అంతేకాని ప్రత్యేక ప్రతిపత్తి కోసం కాదని కేపీసీసీ కార్యాధ్యక్షుడు దినేశ్ గుండూరావు స్పష్టం చేశారు. జాతీయ గీతంతో సమానమైన గౌరవం దీనికీ ఇస్తున్నామన్నారు. కన్నడపతాకానికి గౌరవం, హోదా లభించాలన్నదే తమ ఉద్దేశమన్నారు...

10లో



గాంధీనగర్ నియోజకవర్గ 4వ కన్నడ సాహిత్య సమ్మేళనంలో కన్నడ పుస్తకాలను ఆవిష్కరిస్తున్న కేపీసీసీ కార్యాధ్యక్షుడు దినేశ్ గుండూరావు

# గుర్తింపు కోసమే కన్నడ ధ్వజం

ఆంధ్రజ్యోతి, బెంగళూరు

రాష్ట్రంలో కన్నడ ధ్వజం ఇప్పటికే ఉందని, అధికారికంగా దీనికి గుర్తింపు ఇవ్వాలన్న ఉద్దేశంతోనేరాష్ట్రపతాక నిర్ణయం తీసుకున్నామని కేపీసీసీ కార్యాధ్యక్షుడు దినేశ్‌గుండూరావు స్పష్టం చేశారు. అంతేకాని ప్రత్యేక ప్రతిపత్తి కోసం కాదని ఆయన పేర్కొన్నారు. గాంధీనగర్ శాసనసభ నియోజకవర్గం 4వ కన్నడ సాహిత్య సమ్మేళనాన్ని ఆదివారం ఆయన లాంఛనంగా ప్రారంభించారు. రేణుకాచార్య కాలేజీలో జరిగిన కార్యక్రమానికి పెద్దసంఖ్యలో సాహితీప్రియులు తరలివచ్చారు. సభను ఉద్దేశించి ప్రసంగించిన దినేశ్ గుండూరావు రాష్ట్రంలో అధికారికంగా నాడ గీత ఉందని జాతీయ గీతంతోపాటు దీనికి ఆదే విధమైన గౌరవం ఇస్తున్నామని, ఆదే రీతిన జాతీయ పతాకంతోపాటు కన్నడ పతాకానికి గౌరవం, హోదా లభించాలన్నది ఉద్దేశ్యమన్నారు. ప్రతిపక్షాలు దీనిపై అనసవరంగా రాద్ధాంతం చేస్తున్నాయని మండిపడ్డారు. కన్నడ భాషా సంస్కృతుల పరిరక్షణ విషయంలో రాజీ పడే ప్రశ్నే లేదన్నారు. కన్నడ భాషను ప్రతి ఒక్కరూ ప్రేమతో నేర్చుకోవాలని సూచించారు. నమ్మమెట్రో రైల్వే స్టేషన్‌లలో హిందీ వాడకంపై అసంతృప్తి వ్యక్తం చేశారు. ముఖ్యమంత్రి సిద్దరామయ్య దీన్ని నిరసిస్తూ కేంద్రానికి లేఖ రాసిన సంగతిని గుర్తు చేశారు. సాహిత్య సమ్మేళనానికి శేషాద్రిపురం విద్యాసంస్థల గ్రూప్ ప్రధాన కార్యదర్శి డా.ఊడే పి.కృష్ణ అధ్యక్షత వహించారు. ఇదే సందర్భంగా ఆయన మాట్లాడుతూ నగర హృదయభాగంలో ఉన్న గాంధీనగర్‌ను మినీ భారత అని అభివర్ణించారు. ఈ నియోజకవర్గంలో అన్ని భాషలు, సంస్కృతుల ప్రజలు సమైక్యంగా సహజీవనం చేస్తున్నారన్నారు. కన్నడ భాషా సంస్కృతులను కాపాడుకుంటూనే పరిసరాల సంరక్షణ వంటి అంశాలపై కూడా ప్రజలు దృష్టిని సారించాలని పిలుపునిచ్చారు. వేదికపై పలువురు సాహితీవేత్తల కన్నడ పుస్తకాలను ఆవిష్కరించారు. మాజీ మంత్రి లీలాదేవి ఆర్.ప్రసాద్, కన్నడ సంస్కృతి విశ్వవిద్యాలయం చాన్సెలర్ డా.పద్మాశేఖర్, కన్నడ సాహిత్య పరిషత్ నగర అధ్యక్షుడు మాయణ్ణ, కార్పొరేటర్ సత్యనారాయణ తదితరులు పాల్గొన్నారు.

# జీఎస్టీ అమలు శుభపరిణామం



కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న అధికారి శ్రీరామ్

యలహంక: దేశవ్యాప్తంగా జీఎస్టీ అమలు కావడం శుభపరిణామమని జీఎస్టి అమలు నుంచి ఎదురయ్యే సవాళ్లు దాన్ని విజయవం జాతీయ ఇన్‌కమ్‌ట్యాక్స్ అధికారి శ్రీరామ్ పేర్కొన్నారు. జీఎస్టీ అమలులో ఎదురయ్యేసవాళ్లు- వాటి పరిష్కారం అనే అంశంపై శేషాద్రిపురం కళాశాలలో శుక్రవారం ఏర్పాటు చేసిన జాతీయస్థాయి సదస్సులో ఆయన పాల్గొని మాట్లాడారు. 125 కోట్ల జనాభాను సంక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని జీఎస్టీ అమలు చేస్తున్నారన్నారు. ఒకో రాష్ట్రంలో ఒక్కో పన్ను విధానం వల్ల ప్రజలు నష్టపోయేవారన్నారు. ఈ నేపథ్యంలో ఒకే దేశం ఒకే పన్ను విధానంతో జీఎస్టీని కేంద్రం అమలు చేస్తోందన్నారు. జీఎస్టీ అమలు పరచడంలో కర్ణాటక మొదటి స్థానంలో ఉంటుందని విశ్వాసం వ్యక్తం చేశారు. కార్యక్రమంలో ఇన్‌స్టిట్యూట్ మినిస్టరీ ఆఫ్ ఎంఎస్ఎం ఇ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా అధికారి రంగప్రసాద్, కర్ణాటక అసోచామ్ చైర్మన్ ఆర్. శివకుమార్, ఎఫ్‌కెసీసీఐ ప్రెసిడెంట్ కె.రవి, జీఎస్టీఎన్ వైస్‌ప్రెసిడెట్ నితిన్ మిశ్ర పాల్గొన్నారు.

గురువారం 22 జూన్ 2017

# అవినీతి అంతం.. యువతతోనే సాధ్యం





మహాత్ముని విగ్రహానికి పూల మాల వేస్తున్న అన్నా హజారే

కళాశాల ప్రాంగణంలోనే విద్యార్థులతో ముఖాముఖి

**బెంగళూరు (శివాజీనగర్), న్యూస్ టుడే:** అవినీతి రహిత, అభివృద్ధి పథంలో దూసుకు పోయే భారతదేశాన్ని సృష్టించటం యువతకు మాత్రమే సాధ్యమని సామాజిక కార్యకర్త అన్నా హజారే పేర్కొన్నారు. యలహంకలోని శేషాద్రిపురం పి.యు.కళాశాలలో బుధవారం సాయంత్రం నిర్వహించిన కార్యక్రమంలో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. విద్యార్థి దశ నుంచే ప్రతి ఒక్కరూ మహాత్ముని ఆశయాలను ఒంటబట్టించుకోవాలని పిలుపునిచ్చారు. సరళత్వంలోనే జీవితం ఉంటుందని, మిగిలిన దంతా పైపై మెరుగులేనని తెలిపారు. కళాశాల ఆవరణలో ఉన్న మహాత్ముని విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పించిన ఆయన, చిరు రాట్నంపై నూలు వడికారు. తనను కలుసుకున్న విద్యార్థులతో ముఖాముఖి అయి వారి ప్రశ్నలకు ఆయన సందేహ నివృత్తి చేశారు.

# ప్రకృతిని వినియోగించుకోవాలి

## - మెకానికల్ ఇంజనీర్స్ సదస్సులో పలువురి అభిప్రాయం



స్మరణ సంచిక ఆవిష్కరణలో ప్రముఖులు

ఆంధ్రజ్యోతి, బెంగళూరు: ప్రకృతిలోని సౌరశక్తి, పవనశక్తి, బయో లాంటి వాటి ద్వారా ఉపయోగించుకోవాలని పలువురు అభిప్రాయపడ్డారు. నగరంలో 31వ జాతీయ మెకానికల్ ఇంజనీర్‌ల సదస్సు జరిగింది. ముఖ్యులుగా భారత ప్రభుత్వ సంప్రదాయేతర వనరుల మంత్రిత్వ శాఖ కార్యదర్శి ఉపేంద్ర త్రిపతి, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ అధ్యక్షుడు మురళీకృష్ణా రెడ్డి, మెకానికల్ ఇంజనీరింగ్ డివిజన్ బోర్డు ఛైర్మన్ ప్రదీప్ చతుర్వేదిలు ముఖ్యులుగా పాల్గొనగా కన్వీనర్‌గా ఎంటి రంగా రెడ్డి, పద్మశ్రీ పురస్కార గ్రహీత వాసగం, ఉడే పి కృష్ణలు పాల్గొన్నారు. ఈ సందర్భంగా నలుగురు ఇంజనీర్‌లకు ఇండస్ట్రీ ఎక్సలెన్సీ అవార్డులను ప్రదానం చేశారు. కార్యక్రమంలో భాగంగా స్మరణ సంచికను ఆవిష్కరించారు.

# ప్రపంచాన్ని శాసించే సత్తా భారత్ సొంతం!

**బెంగళూరు, (హెబ్బాళ) న్యూస్‌టుడే :** అంతరిక్ష పరిజ్ఞానంలో ప్రపంచాన్ని శాసించే సత్తా భారత్‌కు ఉందని ఇస్రో మాజీ శాస్త్రవేత్త పద్మశ్రీ ఆర్.ఎం.వాసగమ్ పేర్కొన్నారు. ఆయన మంగళవారం స్థానిక ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజినీరింగ్ (ఐఈ)లో అగస్త్య అంతర్జాతీయ సంస్థ, ఇస్రో, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజినీరింగ్ సంయుక్తంగా భారతీయ విఖ్యాత శాస్త్రవేత్త విక్రమ్ సారాభాయి జయంతి కార్యక్రమంలో పాల్గొని మాట్లాడారు. మంగళయాన్ అనే ఉపగ్రహం రూపకల్పనలో భారత్ తన అంతరిక్ష రంగంలోని సత్తాను ప్రపంచానికి చాటించందన్నారు. విజ్ఞానం అనేది అన్ని రంగాలకూ మూలాధారమనే సందేశం ప్రతి విద్యార్థికీ తెలియజెప్పటం విద్యా, విజ్ఞాన సంస్థల బాధ్యత కావాలన్నారు. ఈ సందర్భంగా ఆయన విక్రమ్ సారాభాయి, మంగలయాన్ ఉపగ్రహంపై సవివర విశ్లేషణ చేశారు. కార్యక్రమంలో ఐఈ అధ్యక్షులు డాక్టర్ ఉడ్డీ కృష్ణ, అగస్త్య సంస్థ పదాధికారులు మహావీర్ కుమార్, అజిత్ బసులు పాల్గొన్నారు. బెంగళూరు, తుమకూరు, రామనగర్‌కు చెందిన 20 పాఠశాలల, కళాశాలలకు చెందిన 300ల మంది విద్యార్థులు ఇదే సందర్భంగా నిర్వహించిన విజ్ఞాన ప్రదర్శనను ఆసక్తిగా తిలకించారు.



జ్యోతి వెలిగిస్తున్న అతిథులు



విజ్ఞాన రహస్యాలను తరచి చూస్తున్న విద్యార్థులు

గురువారం 19 డిసెంబర్ 2013 ఆంధ్రజ్యోతి

# సిసలైన గాంధేయవాది నెల్సన్ మండేలా

## - సంతాప సభలో గవర్నర్ హంసరాజ్ భరద్వాజ్



మండేలా చిత్రపటానికి పూలు చల్లి నివాళులర్పిస్తున్న గవర్నర్

ఆంధ్రజ్యోతి, బెంగళూరు : దక్షిణాఫ్రికా మాజీ అధ్యక్షులు నెల్సన్ మండేలా సిసలైన గాంధేయ వాది అని రాష్ట్ర గవర్నర్ హంసరాజ్ భరద్వాజ్ అభిప్రాయపడ్డారు. గాంధీ భవన్‌లో బుధవారం మండేలా సంతాపసభ జరిగింది. గాంధీ స్మారక నిధి సమితి అధ్యక్షులు ప్రొఫెసర్ శ్రీనివాసయ్య, గాంధీ శాంతి ప్రతిష్ఠాన సంఘం జాతీయ కార్యదర్శి సురేంద్రకుమార్, రాష్ట్ర అధ్యక్షులు ఉడిపి క్రిష్ణ, యశ్‌పాల్ మల్హోత్ర, సంస్కృతి విశ్వవిద్యాలయ ఉపకులపతి మల్లేపుర వెంకటేష్‌లతో పాటు పలువురు సంతాపసభ ఏర్పాటు చేశారు. మండేలా చిత్రపటానికి పూలు చల్లి నివాళులర్పించిన తర్వాత గవర్నర్ మాట్లాడుతూ తనదేశంలోని నల్లజాతీయులకు జరుగుతున్న అన్యాయంపై శాంతియుతంగా సుదీర్ఘ పోరాటం చేసిన మహనీయుడు మండేలా అన్నారు. జైలులో ఏళ్లతరబడి గడిపినా నిరుత్సాహం లేకుండా ఉద్యమాన్ని సాగించారన్నారు. మండేలా శాంతి స్వభావం నేటి యువతకు ఆదర్శం కావాలన్నారు. ఇదే వేదికపై గ్రామీణ పంచాయతీరాజ్ శాఖా మంత్రి హెచ్.కె. పాటిల్ మాట్లాడుతూ మానవతా వాదానికి మండేలా సాక్ష్యంగా చెప్పవచ్చు అన్నారు.

ఆంధ్రజ్యోతి

గురువారం 25, జూలై 2013

సాంకేతిక సమాచారంలో

# బెంగళూరు ముందంజ

- మంత్రి జయచంద్ర



ప్రదర్శనను తిలకిస్తున్న మంత్రి టి.బి.జయచంద్ర, తదితరులు

ఆంధ్రజ్యోతి, బెంగళూరు : సాంకేతిక సమాచార విభాగంలో దక్షిణాసియాలోనే బెంగళూరు నగరం ముందంజలో ఉందని మరో పదేళ్ళకాలంలో మరింత ముందుకు దూసుకుపోతుందని ఐటి, బిటి శాఖల మంత్రి టి.బి.జయచంద్ర అభిప్రాయపడ్డారు. బుధవారం నిమ్హాన్స్ కన్వెన్షన్ హాలులో ఏర్పాటు చేసిన జాతీయ సాంకేతిక సమాచా ర సదస్సును మంత్రి ఆరంభించారు.

అనంత రం ఐటీ ప్రతినిధుల నుద్దేశించి మా ట్లాడుతూ బెంగళూరు సాంకేతిక సమాచార రంగంలో ముందంజలో ఉన్నా వైద్య, వ్యవసాయ విభాగాలలోను సాంకేతికం పెరగాల్సి ఉందన్నారు. దేశంలో సాంకేతిక విప్లవం ద్వారా కొత్త ఆవిష్కరణలు సాధ్యమవుతాయన్నారు. దేశ సమాచార సాంకేతిక విభాగం ప్రతినిధి సుధాకర్‌పైతో పాటు పలువురు పాల్గొన్నారు. సాంకేతిక పద్ధతుల నమూనాలను ప్రదర్శించిన విద్యార్థులకు మంత్రి బహుమతులు అందించారు.

# 'మత్తు'కు దూరంగా ఉండాలి

## నగరంలో డ్రగ్స్ వ్యతిరేక జాగృతి



బెంగళూరు గాంధీ స్మారకనిధిలో జరిగిన కార్యక్రమం...

బెంగళూరు, న్యూస్‌టుడే: మాదక ద్రవ్యాల వ్యతిరేక జాగృతిలో భాగంగా బుధవారం నిర్వహించిన కార్యక్రమాన్ని సిఐడి ఏడీజీపీ మెహరిక్, ఐజీపీ దయానంద, డిఐజి సౌమేందు ముఖర్జీలు బుధవారం ప్రారంభించారు. మత్తు పదార్థాలకు బానిసైతే జీవితం నరకప్రాయమవుతుందని హెచ్చరించే చిరు పుస్తకాన్ని వారు ఆవిష్కరించారు. మత్తుపదార్థాలు, మాదక ద్రవ్యాలకు వ్యతిరేకంగా జాగృతి కల్పించేందుకు ప్రకటనలో కూడిన ప్రత్యేక వాహన సంచారాన్ని ఆరంభించారు. వేర్వేరు స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు జాగృతి కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

డ్రగ్స్ విక్రేతలపై ఉన్న కేసుల్లో 877 కేసులు కోర్టుల్లో ఇప్పటికీ పెండింగ్‌లో ఉన్నాయన్నారు. వీటిలో గంజాయి, హెరాయిన్ తదితరాల విక్రయం కేసులే ఎక్కువని తెలిపారు. 2011లో 21 కేసులే నమోదయ్యాయని, ప్రస్తుతం ఈ సంఖ్య బాగా పెరిగిందని చెప్పారు. మాదక ద్రవ్యాలకు వ్యతిరేకంగా మద్యపాన సంయమన మండలి, గాంధీ భవన్‌లో నిర్వహించిన జాగృతి కార్యక్రమం, ప్రదర్శనల్లో వేర్వేరు కళాశాలలకు విద్యార్థినులు పాల్గొన్నారు. గాంధీజీ మార్గాన్ని ప్రతి ఒక్కరూ అనుసరించాలని చాటే గోడ పత్రికల్ని విద్యార్థినులు ప్రదర్శించారు.



జాగృతి కార్యక్రమానికి హాజరైన యువత

ఆంధ్రజ్యోతి
గురువారం 31, జనవరి 2013

# జాతిపితకు ఘన నివాళి




గాంధీ భవన్‌లో..

బుధవారం జాతిపిత గాంధీజీ వర్ధంతి సందర్భంగా సర్వోదయదినాన్ని అత్యంత భక్తి శ్రద్ధలతో ఆచరించి జాతిపితకు నివాళులు అర్పించారు. గాంధీభవన్‌కు చెందిన పదాదికారుల తోపాటు పాఠశాలల విద్యార్థులు జాతి పితకు శ్రద్ధాంజలి ఘటించినవారిలో ఉన్నారు. ఈ సందర్భంగా విద్యార్థులు గాంధీజీ ఆదర్శాలను పఠిస్తూ వాటిని చిత్తశుద్ధితో ఆచరించడానికి ప్రతిజ్ఞ చేపట్టారు.

ఈనాడు కర్ణాటక
గురువారం 31 జనవరి 2013

# జాతిపితకు ఘన నివాళులు



ఆనందరావు కూడలిలో...

చేసిన సర్వధర్మ ప్రార్థనల్లో సీఎం జగదీష్ షెట్టర్ పాల్గొన్నారు. ఆయన గాంధీ చిత్ర పటానికి పూలమాల వేసి నివాళులు అర్పించారు. ఎంజీ రోడ్డులో అలంకరించిన మహాత్మా గాంధీ విగ్రహానికి మేయర్ వెంకటేష్‌మూర్తి, కమిషనర్ సిద్ధయ్య నివాళులు అర్పించారు. అనంతరం అక్కడ ఏర్పాటైన ప్రార్థనలో పాల్గొన్నారు. ఆనందరావు కూడలిలోని మహాత్మాగాంధీ విగ్రహానికి భారతీయ సేవాదళ్ కార్యకర్తలు, విద్యార్థులు పూలమాలలు వేసి నివాళులు అర్పించారు. గాంధీభవన్‌లోనూ సర్వధర్మ ప్రార్థనలు జరిగాయి.

# మన మంత్రాలయం

**అమృతవాక్కు**
ఎంత గొప్ప వ్యక్తికైనా ఎప్పుడూ
చేపకున్నంత స్వేచ్ఛ ఉండదు - వాన్ ఫ్యాన్ క్లీన్

**టెలీడైరీ**

| | |
|---|---|
| మన ఎంపీ: కోట్ల సూర్యప్రకాశ్ రెడ్డి | 94901 31222 |
| మన ఎమ్మెల్యే: వై.బాలనాగిరెడ్డి | 90003 88459 |
| ఇరిగేషన్ డీఈఈ: లక్ష్మీనరసింహా | 94405 76240 |
| వ్యవసాయ శాఖ ఏడీఏ: రాఘవరెడ్డి | 95055 18172 |

# పరిహారం.. పరిహాసం

పెద్దకడబూరు,న్యూస్‌లైన్:

వర్షాభావంతో గత ఏడాది ఖరీఫ్‌లో వేసిన వేరుశనగ పంట నష్టపోయిన రైతులను ప్రభుత్వం ఆదుకునేందుకు ఐదు నెలల కిందట కరువు ప్రాంతాలను ప్రకటించింది. ఇప్పటికీ అర్హులకు పరిహారం అందక పోవడంతో దిగాలు చెందుతున్నారు. ప్రభుత్వ సాయం చేస్తే తమ కష్టాలు కొంతైనా తీరుతాయని, ఆశగా ఎదురుచూస్తున్నారు. గతంలో అధికారులు, ఎండిపోయిన పంటను గుర్తించి ప్రభుత్వానికి నివేదికను అందజేసి నెలలు గడుస్తున్నా నిధులు మంజూరులో ఎందుకు జాప్యం చేస్తుందో తెలియడం లేదని రైతులు వాపోతున్నారు. పంటల దిగుబడులు చేతికందక అప్పుల్లో కూరుక పోయామని రైతులను ఆదుకోవాల్సిన పాలకులు మొద్దునిద్ర పోతున్నారని మండిపడుతున్నారు. మండలంలో ఖరీఫ్‌లో దాదాపు 12 వేల హెక్టార్లలో పత్తి,ఆముదం,వేరుశనగ,సజ్జ తదితర పంటలను సాగుచేశారు. అయితే తీవ్ర వర్షాభావంతో 80 శాతం పంటలు పూర్తిగా ఎండిపోయినట్లు వ్యవసాయ అధికారుల అంచన. దాదాపు 10 వేల ఎకరాల్లో పంటలు ఎండిపోయి రైతులకు పెట్టిన పెట్టుబడి కూడ రాలేదు.

ఎండిపోయిన వేరుశనగ పంటను పరిశీలిస్తున్న ఏడీ (ఫైల్)

**నివేదికలో అర్హులకు అన్యాయం:**
మండలం 10 వేల హెక్టార్లలో పంటలు ఎండిపోతే వ్యవసాయ అధికారుల మాత్రం 6964.03 హెక్టార్లలో పంటలు నష్టపోయినట్లు ప్రభుత్వానికి నివేదిక పంపడం శోచనీయం. ప్రభుత్వం పరిహారం మంజూరు చేస్తే 3 వేల హెక్టార్ల పంటలకు పరిహారం అందదు. ఒకవేళ అలాంటి సందర్భం వస్తే ఆందోళనలు చేపట్టి అర్హులకు న్యాయం చేస్తామని రైతు సంఘం నాయకులు చెబుతున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం స్పందించి పరిహారం విడుదల చేసేందుకు చర్యలు తీసుకోవాలని కోరుతున్నారు.

**పరిహారం ఇవ్వాలి: ఖర్జప్ప**
ఖరీఫ్‌లో 15 ఎకరాల్లో పత్తి పంటను సాగుచేసి పెట్టుబడులకు కోసం రూ.2 లక్షలు ఖర్చు చేశా. సకాలంలో వర్షాలు రాకపోవడంతో పంట ఎదుగుదల లేదు. కదా పూర్తిగా ఎండిపోయింది. కిలో పత్తి కూడా చేతికందలేదు. రూ.రెండు లక్షలు నష్టపోయి అప్పులపాలయ్యా. ప్రభుత్వం పరిహారం మంజూరు చేసి ఆదుకోవాలి.

**రైతులను ఆదుకోవాలి: వీరేష్, రైతుసంఘం నాయకుడు**
గతేడాది ఖరీఫ్‌లో వర్షాభావంతో పంటలను కోల్పోయిన రైతులను ప్రభుత్వం ప్రకటించిన పరిహారాన్ని వెంటనే విడుదల చేసి ఆదుకోవాలి. వ్యవసాయాధికారులు ప్రభుత్వానికి నివేదికను అందజేసి నెలలు గడుస్తున్నా నిధులు విడుదలలో జాప్యం తగదు.

## భక్తులను అలరించిన సంగీత కచేరీ

శ్రీమఠం కళా ప్రాంగణంలో కచేరి నిర్వహిస్తున్న సుకన్య ప్రభాకర్

మంత్రాలయం అర్బన్,న్యూస్‌లైన్: శ్రీ మఠం పూర్వపు పీఠాధిపతులు ...ంద్ర తీర్థుల ఉత్తరారాధనోత్సవాల సందర్భంగా మైసూరుకు చెందిన శ్రీమతి సుకన్యాప్రభాకర్ నిర్వహించిన దాసచంద్రిక సంగీత కచేరి భక్తులను అలరించింది. అదే విధంగా శ్రీమతి గీతాకులకర్ణి చేసిన దాసవాణి కూడా ఆకట్టుకుంది మఠం కళా ప్రాంగణంలో నిర్వహించిన సంగీత కచేరీల్లో భక్తులు మునిగితేలి మైమరచిపోయారు. కార్యక్రమాల్లో స్టేజీ ఇన్‌చార్జి డీఎం ఆనందరావు పాల్గొన్నారు.

## 'ప్రత్యేకాధికారిని సస్పెండ్ చేయాలి'

కోసిగి,న్యూస్‌లైన్: మండల కేంద్రంలో నెలకొన్న సమస్యలను పరిష్కరించడంలో నిర్లక్ష్యం చేస్తున్న ప్రత్యేక అధికారిణిని సస్పెండ్ చేయాలని సీపీఐ మండల కార్యదర్శి ప్రకాష్ డిమాండ్ చేశారు. సోమవారం ఆ పార్టీ ఆధ్వర్యంలో స్థానిక 3వ వార్డులో నెలకొన్న తాగునీటి సమస్యలను పరిశీలించి మాట్లాడారు. ఏ కాలనీలో చూసిన పారిశుధ్యం కొరవడిందని,చెత్తాచెదారం రోడ్లపైనే పేరుకుపోయిందన్నారు. మంచినీటి పైపులైన్లు పగిలిపోయి నీరు కలుషితం అవుతున్నా మరమ్మత్తులు చేపట్టకపోవడం విచారకరం అన్నారు. ఈ నీటిని తాగి స్థానికులు రోగాల బారిన పడుతున్నట్లు చెప్పారు.ఈ సమస్యలపై అధికారులకు విన్నవించినా వారు పట్టించుకోలేదన్నారు. సమస్యలపై నిర్లక్ష్యం చూపుతున్న ప్రత్యేకాధికారితో పాటు ఇతర మండల అధికారులను సస్పెండ్ చేయాలన్నారు. కార్యక్రమంలో సీపీఐ నాయకులు గోపాల్,జిలానీ,ఇనాయతుల్లా, పరుశురాం,ఓంకారస్వామి,తాయన్న పాల్గొన్నారు.

## నడిచే రాఘవేంద్రులు సుశమీంద్రతీర్థులు

'సుధీజన సుమందారం..సుధీంద్రసుత సుప్రియం..సుశమీంద్రగురుం వందే సుజయీంద్ర కరోద్భవం..' శ్రీమఠం పూర్వపు పీఠాధిపతులు సుశమీంద్రతీర్థులు సాక్షాత్తు నడిచే రాఘవేంద్రులంటూ ప్రస్తుత పీఠాధిపతులు సుయతీంద్రతీర్థులు ప్రశంసించారు. ఆయన్ను సేవించినా ఆ ఫలితం రాఘవేంద్రులకు చెందుతుందన్నారు. వారి కృపాకటాక్షాలతోనే శ్రీమఠం, భక్తులు సుభిక్షంగా ఉంటారని ఆయన చెప్పారు. ఆరాధనోత్సవాల్లో పాల్గొనడం... స్మరణ సకల శుభదాయకం అన్నారు. 2009 వరదలో అతలాకుతలమైన శ్రీమఠం స్వామి మహిమలకు తోడు భక్తుల ఇతోధిక సాయంతో ఊహించని విధంగా అభివృద్ధి చెందిందని అన్నారు.

శ్రీవాగీశతీర్థుల ఆరాధనకు వెళ్లిన పీఠాధిపతులు: శ్రీ మఠం పీఠాధిపతులు సుయతీంద్రతీర్థులు సోమవారం ఉత్తరారాధనోత్సవాలను ముగించుకొని మధ్య మహా సంస్థానం పూర్వపు పీఠాధిపతులు శ్రీవాగీశతీర్థుల ఆరాధనలో పాల్గొనేందుకు కర్ణాటకలోని నవబృందావన గడ్డ (ఆనెగొంది)కి బయలుదేరారు. మంగళవారం వరకు అక్కడే ఉండి 11న రాత్రి గంగావతికి చేరుకుంటారు. మూడు రోజులు అక్కడ ఉండి 15న మహబూబ్‌నగర్ సమీపంలోని ... చేరుకుంటారు. 16న పీఠాధిపతులు బెంగళూరుకు వెళతారు. 17న హైదరాబాదుకు వెళ్లి అక్కడ 20వ వరకు ఉంటారు. 21న ఉదయం మంత్రాలయంకు చేరుకుంటారని మఠం అధికారులు తెలిపారు. - న్యూస్‌లైన్, మంత్రాలయం అర్బన్

## ఇందిరాక్రాంతి పథంపై అవగాహన

కోసిగి,న్యూస్‌లైన్:

గ్రామాల ప్రజలు ఇందిరాక్రాంతి పథంపై అవగాహన కలిగిఉండాలని డీఆర్‌డీఏ జిల్లా ప్రాజెక్టు మేనేజర్ శ్రీధర్‌రావు తెలిపారు. సోమవారం స్థానిక ఐకేపీ కార్యాలయంలో ఆయన గ్రామైక్య సంఘం సభ్యులతో సమావేశమై మాట్లాడారు. 2012-13 ఆర్థిక సంవత్సరానికి సంస్థాగత నిర్మాణ ప్రణాళిక ఏర్పాటు చేస్తామన్నారు. అందులో పదహారు అంశాలపై ప్రజలకు అవగాహన కల్పిస్తామన్నారు. బ్యాంక్ లింకేజ్, స్త్రీ నిధి, ఇన్సూరెన్స్, మార్కెటింగ్‌లతో పాటు మరో 12 అంశాలపై శిక్షణ ఇచ్చి మహిళల అభ్యున్నతికి కృషి చేస్తామన్నారు. కార్యక్రమంలో ఏపీఎం రామచంద్ర,సీసీలు తిమేష్, అరుణ తదితరులు పాల్గొన్నారు.

## ప్రజాదర్బారుకు స్పందన కరువు

మంత్రాలయం అర్బన్,న్యూస్‌లైన్:

ప్రజా సమస్యల పరిష్కారానికి మండల కేంద్రాల్లో ప్రతివారం ఏర్పాటు చేసిన ప్రజాదర్బార్ స్పందన కొరవడింది అధికారులు రాలేదని ప్రజలు, ప్రజలు రాలేదని అధికారులు ఒకరిపై మరొకరు చెప్పుకొని ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా చేపట్టిన కార్యక్రమాలను తుంగలో తొక్కుతున్నారు. సోమవారం స్థానిక ఎంపీడీఓ కార్యాలయంలో నిర్వహించిన ఈ కార్యక్రమానికి ఎంపీడీఓ, వ్యవసాయశాఖ అధికారి, ఈఓఆర్డీ, గ్రామ కార్యదర్శులు, కొందరు వీఆర్వోలు మాత్రమే హాజరైయ్యారు. మండల ప్రత్యేకాధికారి గైర్హాజరయ్యారు మండల శాఖల అధికారులు కూడా ఈ కార్యక్రమానికి డుమ్మాకొట్టారు

## పురస్కారాల ప్రదానం

రాఘవేంద్రస్వామి మఠం పూర్వపు పీఠాధిపతులు సుశమీంద్ర తీర్థుల నాలుగో ఆరాధనోత్సవాల సందర్భంగా సోమవారం కూడా సుశమీంద్ర పురస్కారాల ప్రదానం జరిగింది. ద్వైతవేదాంతంపై జయతీర్థాచార్‌కు, దాససాహిత్యంపై పురందర జోషికి, సామాజిక సేవపై డీవీ నాగభూషణంకు, జర్నలిజంలో నరసింహకు, మూగ,చెవిటి పాఠశాల నిర్వాహకులకు ప్రస్తుత పీఠాధిపతి పురస్కారాలను అందజేసి ఘనంగా సన్మానించి ఆశీర్వదించారు. అనంతరం శ్రీమఠం అన్నపూర్ణ భోజనశాలలో పనిచేయు ఉద్యోగి భీమకు ఉత్తమ ఉద్యోగిగా ప్రకటించి ఫలమంత్రాక్షితలు అందజేశారు. మంత్రాలయ మహాన్ అన్న తమిళ మాసపత్రికను పీఠాధిపతులు సుయతీంద్రతీర్థులు ఆవిష్కరించారు. కార్యక్రమాల్లో ఏఏఓ సుయమీంద్రాచార్,ఏఏఓ మాధవశెట్టి,మేనేజర్లు శ్రీపతి,వెంకటేష్‌జోషి, సంస్కృత విద్యాపీఠం ప్రిన్సిపాల్ డాక్టరు వాదిరాజాచార్, డీఎం ఆనందరావు, క్యాషియర్ రవికులకర్ణి, సీఆర్వో ఐపి నరసింహ, సంప్రతిమోహన్ తదితరులు పాల్గొన్నారు.
- మంత్రాలయం అర్బన్,న్యూస్‌లైన్

మంత్రాలయ మహాన్ అన్న తమిళ మాసపత్రికను ఆవిష్కరిస్తున్న పీఠాధిపతులు

సామాజిక సేవపై అవార్డు అందుకుంటున్న డీవీ నాగభూషణం

జర్నలిజంపై అవార్డు అందుకుంటున్న నరసింహ, అవార్డు అందుకుంటున్న కుమార్ విజయ్ మూగ,చెవిటి పాఠశాల నిర్వాహకులు, మఠం ఉత్తమ ఉద్యోగిగా భీమను సన్మానిస్తున్న పీఠాధిపతులు. దాససాహిత్యంపై అవార్డు అందుకుంటున్న పురందరజోషి, ద్వైతవేదాంతంపై శ్రీసుశమీంద్ర పురస్కారాన్ని అందుకుంటున్న డాక్టరు జయతీర్థాచార్

ఆంధ్రజ్యోతి

03-10-2010



గాంధీజీ విగ్రహానికి పూలమాల వేస్తున్న సీఎం యడ్యూరప్ప

ఈనాడు కర్ణాటక
సోమవారం 15 జూన్ 2009



రక్తదానంపై ప్రజాచైతన్యం తెచ్చిన దాతలను తయారు చేస్తున్న తుమకూరు డీసీ సోమశేఖర్, టీఎం స్వామి,రామచంద్రలకు జ్ఞాపికలు అందజేసిన గవర్నర్ రామేశ్వర ఠాకూర్.

# రెడ్‌క్రాస్ చరిత్రతో 'సమర్పణ'

బెంగళూరు; జూన్ 14 (న్యూస్ టుడే): సరిగ్గా నూటాయాభై సంవత్సరాల క్రితం... ఇటలీ, ఫ్రాన్స్, ఆస్ట్రియా దేశాల నడుమ చోటుచేసుకున్న భీకర యుద్ధం. ఫలితంగా వేలాది మంది క్షతగాత్రులుగా మారారు. స్విట్జర్లాండ్‌కు చెందిన హెన్రీ డునాల్డ్ ఆ దృశ్యాల్ని చూసి చలించిపోయారు. వారిని అక్కున చేర్చుకున్నారు. ఆదుకున్నారు. అనాటి సేవాతత్పరత నుంచి పుట్టిందే 'రెడ్‌క్రాస్'. ఈ సంస్థ ఏర్పాటై 150 ఏళ్లు పూర్తయిన సందర్భంగా ఆదివారం సాయంత్రం ఇక్కడి రాజ్‌భవన్ గ్లాస్‌హౌస్‌లో 'సమర్పణ' పేరుతో సంగీత, నృత్య రూపకాల్ని ప్రదర్శించారు. కథక్, ఒడిస్సి, భరతనాట్యం, సినీ దేశభక్తి గీతాలాపనతో రెండు గంటల పాటు సమర్పణ కొనసాగింది. గవర్నరు రామేశ్వరఠాకూర్ కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఆయన మాట్లాడుతూ యువత సేవా మనోభావాన్ని పెంపొందించుకోవాలని పిలుపునిచ్చారు. రెడ్‌క్రాస్ సంస్థలో చేరడం ద్వారా సమాజ సేవకు అంకితం కావాలన్నారు. కార్పొరేట్ సంస్థలు, పారిశ్రామికవేత్తలు, దాతలు సంస్థ సేవా కార్యక్రమాలకు అండగా నిలవాలన్నారు. కార్యక్రమంలో సంస్థ కర్ణాటకశాఖ గౌరవాధ్యక్షుడు రాజు చంద్రశేఖర్, బెంగళూరు దూరదర్శన్ కేంద్రం సంచాలకుడు మహేష్‌జోషి తదితరులు పాల్గొన్నారు. కార్యక్రమాన్ని బెంగళూరు దూరదర్శన్ కేంద్రం ప్రత్యక్ష ప్రసారం చేసింది.

ఈనాడు సోమవారం జూన్ 15, 2009

# రక్తదానంలో రామోజీ గ్రూప్‌నకు అవార్డు

## ● గవర్నర్ చేతుల మీదుగా ప్రదానం

హైదరాబాద్, న్యూస్‌టుడే: రక్తదాన శిబిరాలను నిర్వహించడంలో రామోజీ గ్రూప్‌నకు అవార్డు దక్కింది. రాష్ట్ర వ్యాప్తంగా ఒకే రోజు అధిక యూనిట్లు సేకరించిన విభాగంలో రెడ్‌క్రాస్ సొసైటీ అవార్డుకు ఎంపికైంది. రక్తంలో గ్రూపు విధానాన్ని కనిపెట్టిన కార్ల్ లాండ్‌స్టైనర్ జయంతిని పురస్కరించుకుని ఆదివారం సాయంత్రం రెడ్‌క్రాస్ సొసైటీ, ఎయిడ్స్ కంట్రోల్ సొసైటీ సంయుక్తంగా రాజ్‌భవన్ దర్బార్‌హాలులో ఓ కార్యక్రమం ఏర్పాటు చేశాయి. ఈ కార్యక్రమంలో గవర్నర్ ఎన్డీ తివారీ విజేతలకు బహుమతులను అందజేశారు. రామోజీ గ్రూప్‌నకు లభించిన కప్‌ను న్యూస్‌టుడే ప్రైవేట్ లిమిటెడ్ డైరెక్టర్ గోపాల్‌రావు.. తివారీ చేతుల మీదుగా అందుకున్నారు. వివిధ విభాగాల్లో సంస్థలు, వ్యక్తిగత బహుమతులనూ గవర్నర్ అందజేశారు. ఈ సందర్భంగా తివారీ మాట్లాడుతూ.. రక్తదాతలు, ప్రోత్సహించిన సంస్థలను అభినందించారు. రెడ్‌క్రాస్ సొసైటీ ఏడాది పొడవునా చేపడుతున్న కార్యక్రమాల పట్ల సంతృప్తి వ్యక్తం చేశారు. ఎంతో రక్తం అందుతున్నా, ఇంకా కొరత ఉందని.. దానిని తీర్చేందుకు పలువురు ముందుకు రావాలని పిలుపునిచ్చారు. కార్యక్రమంలో 'రక్తదాతకు మార్గదర్శక సూత్రాలు', 'మీ నేస్తం' అనే పుస్తకాలను ఆవిష్కరించారు. రక్తదాతలకు ఈ పుస్తకాలు ఎంతో ఉపకరిస్తాయని రాష్ట్ర ఎయిడ్స్ కంట్రోల్ సొసైటీ సంచాలకులు ఆర్.వి. చంద్రవదన్ పేర్కొన్నారు. కార్యక్రమంలో రెడ్‌క్రాస్ సొసైటీ కార్యదర్శి జస్టిస్ లక్ష్మణరావు; ఛైర్మన్ ఆర్యేంద్రశర్మ, మాజీ కార్యదర్శి, ఎమ్మెల్సీ రాజ్యలక్ష్మి, గవర్నర్ కార్యదర్శి రమేష్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు.

**అవార్డు గ్రహీతలు:** రోలింగ్ షీల్డ్, కప్ అందుకున్న సంస్థలు, వ్యక్తుల్లో కార్వీ స్టాక్‌బ్రోకింగ్ లిమిటెడ్, డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ (వికారాబాద్); మల్లారెడ్డి కాలేజ్ ఆఫ్ ఇంజినీరింగ్ అండ్ టెక్నాలజీ, అయ్యప్ప సేవా సమితి ఉన్నాయి. కప్‌కు ఎంపికైన సంస్థల్లో రామోజీ గ్రూప్, ల్యాంకో గ్రూప్, గోకరాజు కాలేజ్ ఆఫ్ ఇంజినీరింగ్ అండ్ టెక్నాలజీ (బాచుపల్లి) ఉన్నాయి.

రక్తదానంపై అధికుల్లో అవగాహన కల్పించినందుకు గాను పలు సంస్థలు, వ్యక్తులకు బంగారు, వెండి పతకాలు, మెరిట్ సర్టిఫికెట్లను అందజేశారు. ఈ విభాగంలో ఎన్టీఆర్ ట్రస్టు తరపున శ్రీశైలం మాదిగ అవార్డును అందుకున్నారు. సత్యం కంప్యూటర్స్‌కు కూడా అవార్డు వచ్చింది. వ్యక్తిగత విభాగంలో డాక్టర్ రాఘవరెడ్డి, డాక్టర్ ఎన్.వి.సుధాకిరణ్, ఎన్.వి.మల్లికార్జునరావు, రుక్సానా, వై.వి.ఆర్.ఎస్.సుందరరావు, కళ్యాణ్ చక్రవర్తి ఉన్నారు. మెరిట్ సర్టిఫికెట్లు అందుకున్న వారిలో శిశిర్ రాజగోపాల్, వి.ఈశ్వరి, ఆర్.కామేశ్వరి, సుబ్బలక్ష్మి ఉన్నారు. వీరంతా రెడ్‌క్రాస్‌కు జీవిత సభ్యులు. ఏడాదిలో ఎక్కువ పర్యాయాలు రక్తదానం చేసినందుకు గాను పలువురికి జ్ఞాపికలు ఇచ్చారు. వారిలో కె.వి.జి.రాజు, ఎస్.వి.భారతి, జి.మధుసూదన శాస్త్రి, డాక్టర్ జి.నందగోపాల్, ఎ.పరమేశ్వర్ ఉన్నారు.



గవర్నర్ ఎన్డీ తివారీ నుంచి రామోజీ గ్రూప్ తరపున అవార్డును స్వీకరిస్తున్న న్యూస్‌టుడే ప్రైవేట్ లిమిటెడ్ డైరెక్టర్ గోపాల్‌రావు

# రక్తదానంపై చైతన్యం తేవాలి

## గవర్నర్ రామేశ్వర ఠాకూర్



కార్యక్రమంలో భాగంగా రక్తదానం చేస్తున్న దాతను అభినందిస్తున్న గవర్నర్ రామేశ్వర ఠాకూర్

బెంగళూరు, జూన్ 14 (న్యూస్‌టుడే): రక్తదానం చేస్తే ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయని ఎక్కువ మంది అభిప్రాయపడుతున్నారని గవర్నర్ రామేశ్వర ఠాకూర్ అన్నారు. అలా అభిప్రాయపడేవారిలో మార్పులు తీసుకువస్తే ఎక్కువ మంది రక్తదాతలు తయారవుతారని పేర్కొన్నారు. ప్రపంచ రక్తదాతల దినోత్సవాన్ని పురస్కరించుకుని రాజ్‌భవన్‌లో ఆదివారం ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. ప్రమాదాలు, కొన్ని శస్త్రచికిత్సల సందర్భంగా ఎక్కువ రక్తం పోవటంతోనే ప్రాణాపాయం ఏర్పడుతున్నట్లు వేర్వేరు అధ్యయనాల్లో తేలింది. ప్రతి ఒక్కరూ తమ కర్తవ్యంగా భావించి ఏటా ఒకసారి తమ రక్తాన్ని దానం చేయాలి. రక్తదానం గురించి ప్రభుత్వేతర సంస్థలు ఎక్కువ జాగృతి కార్యక్రమాలను రూపొందించుకోవాలని సూచించారు. రక్తదానం చేసే వారిలో ఎక్కువ మంది పురుషులే ఉన్నారు. మహిళలు కూడా రక్తదానం చేసేందుకు ముందుకు రావాలని గవర్నర్ కోరారు. దేశంలో రక్తానికి అవసరం పెరిగింది. అవసరానికి తగినట్లుగా లేక దాతల సంఖ్య తగ్గుముఖం పట్టిందన్నారు. ఎక్కువ మందిని రక్తం దానం చేసేలా ప్రోత్సహించేందుకు పలు కార్యక్రమాలు రూపొందించామని రెడ్‌క్రాస్ సంస్థ ఉపాధ్యక్షుడు వూడె పి.కృష్ణ తెలిపారు. కర్ణాటకలో ఏటా 5.5 లక్షల యూనిట్ల రక్తం అవసరమవుతుండగా, 4 లక్షల యూనిట్లు దాతల నుంచి లభిస్తుందని చెప్పారు. మిగిలిన 1.5 లక్షల యూనిట్లకు కొరత ఉందన్నారు. లయన్స్ సంస్థ గత 29 ఏళ్లుగా నగరంలో రక్తదాన శిబిరాలు నిర్వహిస్తోన్న విషయాన్ని గుర్తు చేశారు. దీని ప్రాధాన్యాన్ని ప్రచారం చేస్తున్న వూడె పి.కృష్ణ, మీరా శివలింగయ్య, నజీర్ అహ్మద్ షేక్, వేర్వేరు ఫౌండేషన్‌ల ప్రతినిధుల్ని గవర్నర్ సన్మానించారు. కార్యక్రమంలో రెడ్‌క్రాస్ సంస్థ ప్రతినిధులు డా.ఎన్.జి.నారాయణ, రాజు చంద్రశేఖర్‌లు పాల్గొన్నారు. రాజ్‌భవన్‌లో ఏర్పాటు చేసిన శిబిరంలో పాతిక మందికి పైగా రక్తదానం చేశారు.

# బెంగళూరు

కర్ణాటక | సోమవారం | జూన్ | 15 | 2009 | www.sakshi.com

# రక్తదానంపై అపోహలు తొలగించాలి

బెంగళూరు, న్యూస్‌లైన్ :

రక్తదానంపై ప్రజల్లో ఉన్న అపోహలను తొలగించేందుకు స్వచ్ఛంద రక్తదానాన్ని ప్రోత్స హించాల్సిన అవసరం ఎంతైనా ఉందని గవర్నర్ రామేశ్వర్ ఠాకూర్ తెలిపారు. రెడ్‌క్రాస్ సంస్థ ॰రం రాజ్‌భవన్‌లో ఏర్పాటు చేసిన ప్రపంచ ॰॰ దాతల దినోత్సవాన్ని ప్రారంభించిన ఆయన ప్రసంగించారు. రోడ్డు ప్రమాదాల్లో గాయపడిన వారు, ఆపరేషన్ చేయించుకున్న వారు రక్తం

**ప్రజల్లో ..**

- స్వచ్ఛందంగా రక్తదానం చేయండి
- ప్రాణదాతలు కండి
- గవర్నర్ రామేశ్వర్ ఠాకూర్
- అవసరానికి తగ్గ రక్తం లేదు : రెడ్‌క్రాస్

దొరక్క ప్రాణాలు కోల్పోయిన సందర్భాలు చాలా ఉన్నాయని ఆవేదన వ్యక్తంచేశారు. ప్రజలు స్వచ్ఛందంగా రక్తాన్ని దానం చేసి విలువైన ప్రాణా ల ॰పాడాలని పిలుపునిచ్చారు.

॰డ్ క్రాస్ సంస్థ ఉపాధ్యక్షులు ఊడె పీ కృష్ణ మాట్లాడుతూ రక్తం దానం చేస్తే ఆరోగ్యం క్షీణి స్తుందన్న భయంతో కొందరు రక్తందానం చేయడా నికి ముందుకు రావడం లేదన్నారు. అలాంటి వారిలో జాగృతి తీసుకువచ్చేందుకు ప్రయత్నిస్తు న్నట్లు చెప్పారు. దేశంలో డిమాండ్‌కు సరిపడా రక్తం లేక అనేక మంది ప్రాణాలు కోల్పోతున్నారని, ప్రతి ఒక్కరూ రక్తాన్ని దానం చేసి ప్రాణాలు కాపాడాలని మనవి చేశారు. రెడ్‌క్రాస్ సంస్థ గౌరవ అధ్యక్షులు రాజు చంద్రశేఖర్ మాట్లాడుతూ రాష్ట్రంలో 5.5 లక్షల యూనిట్ల రక్తం అవసరం ఉండగా దాతల నుంచి 4 లక్షల యూనిట్ల రక్తం లభిస్తోందని, 1.5 లక్షల యూనిట్ల కొరత ఉందని వివరించారు. ఆ కొరతను నివారించుకునే దిశలో కార్యక్రమాలు చేప ట్టాల్సి ఉంటుందన్నారు. ఈ సందర్భంలో పలు సంస్థలను అభినందించిన గవర్నర్ అవార్డులను అందజేశారు.




రక్తదాతల దినోత్సవ సందర్భంగా అవార్డులను అందజేస్తున్న గవర్నర్ రామేశ్వర్ ఠాకూర్

సోమవారం 14 జూలై 2008 ఆంధ్రజ్యోతి



రెడ్‌క్రాస్ సొసైటీ వార్షిక సమ్మేళనంలో పాల్గొన్న గవర్నర్ రామేశ్వర్ ఠాకూర్

సోమవారం 14, జూలై 2008 | ఆంధ్రజ్యోతి




ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ సమ్మేళనంలో గవర్నర్ రామేశ్వర్ ఠాకూర్ అంధులకు ఎలక్ట్రానిక్ ఊత కర్రలను అందచేస్తున్న దృశ్యం

ఈనాడు కర్ణాటక

సోమవారం 18 మే 2015

# సామాజిక సేవలకు సిద్ధం

## రాఘవేంద్ర రాజ్‌కుమార్ వెల్లడి



వికలాంగ బాలికకు చేయూత ఉపకరణాలు అందిస్తున్న అతిథులు

**బెంగళూరు (హెబ్బాళ) న్యూస్‌టుడే:** కన్నడ కంఠీరవ డా.రాజ్‌కుమార్ కుటుంబం సమాజానికి ఏమీ చేయలేదనే అపవాదును అంగీకరించాల్సిందే నని రాజ్‌కుమార్ కుమారుడు రాఘవేంద్ర రాజ్‌కుమార్ అన్నారు. అయితే ఈ అపవాదును తొలగించుకొనే ప్రయత్నంలో భాగంగా తాము రానున్న రోజుల్లో విద్య, ఆరోగ్య సంస్థలతో పాటు లక్షల సంఖ్యలో మొక్కల పెంపకం వంటి సేవా కార్యక్రమాలను చేపట్టేందుకు సిద్ధమవుతున్నట్లు ఆయన చెప్పారు. ఆదివారం స్థానిక శేషాద్రిపురం కళాశాలలో నిర్వహించిన కళింగ విద్యా సంస్థల సేవా కార్యక్రమం, ఆర్ట్ ఆఫ్ గివింగ్ వార్షికోత్సవంలో ఆయన పాల్గొని మాట్లాడుతూ తాము డబ్బు, ఖ్యాతి, ప్రేక్షకుల ప్రేమను సంపాదించిన మాట వాస్తవమే అయితే వీటితో పాటు సామాజిక సేవలను కూడా ఇకపై నిర్వర్తించేందుకు తమ కుటుంబ సభ్యులందరూ సిద్ధమన్నారు. అయితే కేవలం పేరు కోసమే ఈ సేవలు చేయటం స్వార్థమవుతుందన్నారు. ఇదే కార్యక్రమంలో శేషాద్రిపురం విద్యా సంస్థల కార్యదర్శి హెచ్.కృష్ణ మాట్లాడుతూ మనిషి అహం వీడి నిస్వార్థంగా ప్రవర్తించ నాడు సేవా భావం పెరుగుతుందన్నారు. అన్ని సమస్యలకు విద్య ద్వారా పరిష్కారం లభిస్తుందని వివేకానందుడు ఇచ్చిన పిలుపును ప్రతి విద్యా సంస్థ స్ఫూర్తిగా తీసుకోవాలన్నారు. కార్యక్రమంలో పాల్గొన్న ఎమ్మెల్యే విజయకుమార్ మాట్లాడుతూ సమాజంలో నిస్వార్థం, సేవా భావం ఉన్న వాడే ధనికుడని మిగిలి వారంతా యాచకులతో సమానమని వ్యాఖ్యానించారు. ఈ సందర్భంగా మణిపాల్ ఫౌండేషన్ సీఈఓ బాలచంద్రన్, ఐపీఎస్ అధికారి డా.సుశాంత్ తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా వికలాంగులకు పలు చేయూత ఉపకరణాలు అందజేశారు.



కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న దేవెగౌడ తదితరులు



ఆకాశ వాహికల కీలక యంత్రభాగమిదీ..

# శాస్త్రజ్ఞానంతో శత్రుత్వ నిర్మూలన!

## మాజీ ప్రధాని దేవెగౌడ వెల్లడి



లక్ష్య రాకెట్‌ను పరిశీలిస్తున్న నిపుణులు

బెంగళూరు (హెబ్బాళ), న్యూస్‌టుడే : పొరుగు దేశాలతో శత్రుత్వం పెంచుకోరాదనే దృష్టితోనే 1997లో పోఖ్రాన్ అణుపరీక్షకు ప్రధాని హోదాలో తిరస్కరించానని మాజీ ప్రధాని దేవెగౌడ వివరించారు. ఆయన గురువారం స్థానిక నిమ్హాన్స్ సభాంగణంలో భారత శాస్త్రసాంకేతిక సంస్థ (ఐటీసీ) ప్రదర్శన ప్రారంభోత్సవంలో పాల్గొని మాట్లాడారు. మనం పొరుగు దేశాలను సాంకేతిక పరిజ్ఞానంతో నియంత్రించే శక్తి పొందినా అదే సందర్భంలో సోదరభావం పెంచుకోవాల్సిన అవసరం ఉందన్నారు. 1997లో అబ్దుల్ కలాం, చిదంబరంలు పోఖ్రాన్ అణుపరీక్ష ప్రస్తావన తన వద్ద తెచ్చినప్పుడు ఇదే నెపంతోనే వద్దని వారించానన్నారు. ఆ తర్వాత 1998లో వాజ్‌పేయి ప్రభుత్వం ఈ పరీక్షలకు అనుమతించిందన్నారు. అమెరికా వంటి దేశాలు శత్రువు దిగ్బంధన చర్యలకు పాల్పడినా భారత్ మాత్రం పొరుగు దేశాలతో మైత్రినే కొనసాగించిందన్నారు.

● భారతీయులకు మరిచే గుణం అధికంగా ఉన్నట్లు దేవెగౌడ నర్మగర్భంగా వ్యాఖ్యలు చేశారు. 2002లో గుజరాత్ నరమేధానికి పాల్పడిన వ్యక్తికి 2014లో పట్టం కట్టినట్లు ఎవరి పూరూ ఉచ్చరించకనే వ్యాఖ్యలు చేశారు. ప్రజల నమ్మకాన్ని వమ్ముచేయని వ్యక్తులే ప్రధానిగా విజయం సాధిస్తారని ఈ దిశగా తాను భారతీయుల మనసులు గెలిచానన్నారు. ఇక భారతదేశం సాంకేతికంగా ఎంతో ప్రగతి సాధించినా రాజకీయాలు సాంకేతిక రంగంలో ఆవిష్కారాలకు అడ్డుగా ఉన్నాయన్నారు. భారత్ సూపర్ పవర్‌గా ఎదగాలంటే సాంకేతిక నిపుణుల ద్వారానే సాధ్యమన్నారు. ఈ దిశగా తాను ఇచ్చిన ప్రోత్సాహంతోనే బెంగళూరు ఐటీ నగరంగా విరాజిల్లుతోందన్నారు. ప్రస్తుతం విద్యుత్ సమస్య రావడంతో పాటు దేశాన్ని వెంటాడుతూ భవిష్యత్తును అంధకారం చేసే ప్రమాదం ఉందన్నారు.

## ఆకాశానికి నిచ్చెనలు

*భారతీయ శాస్త్ర సాంకేతిక సంస్థ (ఇండియన్ సైన్స్ కాంగ్రెస్-2014) సదస్సులో భాగంగా బెంగళూరు ఇంజినీర్ల సంఘం నిమ్హాన్స్ సమావేశ మందిరంలో ఆవిష్కరించిన వివిధ ప్రదర్శనాంశాలు విశేషంగా ఆకట్టుకున్నాయి. కార్యక్రమాన్ని ప్రారంభించిన మాజీ ప్రధాన మంత్రి హెచ్.డి.దేవెగౌడ అక్కడి శాస్త్రవేత్తలతో మాట్లాడి వివరాలు తెలుసుకుంటున్న దృశ్యమిది. ఇస్రో తయారీ ఉపగ్రహాల పనితీరుపై ఆయన ఆసక్తిని కనబరచడం గమనార్హం!*



ఆంధ్రజ్యోతి శుక్రవారం 22 ఆగస్టు 2014

# భారత్‌ను సూపర్ పవర్‌గా మార్చేది శాస్త్రవేత్తలే

- ఇండియన్ టెక్నికల్ కాంగ్రెస్ 2014

## జాతీయ సదస్సును ప్రారంభించిన దేవెగౌడ

బెంగళూరు, ఆగస్టు21 (ఆంధ్రజ్యోతి) : భారతదేశాన్ని సూపర్ పవర్‌గా మార్చే శక్తి రాజకీయ నాయకులకు లేదని, అది కేవలం శాస్త్రవేత్తలు, ఐటీ నిపుణులకే సాధ్యమని మాజీ ప్రధాని హెచ్ డీ దేవెగౌడ అభిప్రాయపడ్డారు. బెంగళూరు నిమ్హాన్స్ కన్వెన్షన్ సెంటర్‌లో గురువారం ఇండియన్ టెక్నికల్ కాంగ్రెస్ 2014 జాతీయ స్థాయి సదస్సును, ప్రదర్శనను ఆయన లాంఛనంగా ప్రారంభించారు. భారతదేశం సూపర్ పవర్ కావడం తథ్యమని, ఈ దిశగా రాజకీయ నాయకులకు చిత్తశుద్ధి, శాస్త్రవేత్తలకు అంకితభావం అవసరమన్నారు. అభివృద్ధిలో రాజకీయాలు కూడదని, అయితే ఇవి రెండూ పరస్పర సమన్వయంతో పారదర్శకంగా ముందుకు సాగితే మన దేశ ప్రగతిని ఎవరూ అడ్డుకోజాలరన్నారు. కేంద్ర భూ విజ్ఞాన కార్యదర్శి డాక్టర్ శైలేష్ నాయక్ మాట్లాడుతూ మన దేశంలో ఖనిజ సంపదకు కొరత లేదని, కాకపోతే చిత్తశుద్ధి మాత్రమే తక్కువగా ఉందని వ్యాఖ్యానించారు. ఈ సదస్సులో ఏర్పాటైన ఆధునిక సాంకేతిక పరికరాల ప్రదర్శన ప్రత్యేక ఆకర్షణగా సాగింది.


ప్రదర్శనను తిలకిస్తున్న మాజీ ప్రధాని దేవేగౌడ

# గాంధేయవాది మండేలా

## గవర్నర్ భరద్వాజ్



నెల్సన్ మండేలా చిత్రపటం వద్ద గవర్నర్ భరద్వాజ్ నివాళి

బెంగళూరు, డిసెంబరు 18 (న్యూస్ టుడే): దక్షిణాఫ్రికా మాజీ అధ్యక్షుడు నెల్సన్ మండేలా నిజమైన గాంధేయ వాది, మహాత్ముడి సిద్ధాంతాలను ఆచరించడంతో పాటు ప్రచారం చేసిన మహనీయుడని గవర్నరు హంస రాజ్ భరద్వాజ్ వ్యాఖ్యానించారు. తెల్లదొరలకు వ్యతిరేకంగా పోరాటం చేసి దేశానికి స్వాతంత్ర్యం, సమానత తెచ్చారని తెలిపారు. బుధవారం ఇక్కడ గాంధీస్మారక నిధి, గాంధీశాంతి ప్రతిష్ఠాన, గాంధీభవన్ ఏర్పాటు చేసిన నెల్సన్‌మండేలా సంతాపసభలో గవర్నర్ ప్రసంగించారు. నేటి యువత గాంధీ సాహిత్యాన్ని చదివి ఆచరించాలని పిలుపునిచ్చారు. మతతత్వం హింస తదితర వాటికి దూరంగా ఉండి సమసమాజం కోసం పాటుపడాలని కోరారు. గ్రామీణాభివృద్ధి, పంచాయతీరాజ్ శాఖ మంత్రి హెచ్. కె. పాటిల్ మాట్లాడుతూ ప్రపంచ వ్యాప్తంగా గాంధీ సిద్ధాంతాలను ప్రచారం చేసిన ఘనత నెల్సన్ మండేలాకు దక్కింది. ఆయన పట్ల భారతీయుల్లో ప్రత్యేక అభిమానం ఉందన్నారు. కార్యక్రమంలో గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు శ్రీనివాసయ్య, కార్యదర్శి సురేంద్రకుమార్ తదితరులు పాల్గొన్నారు.

### ప్రభుత్వం బాగా పని చేస్తోంది

రాష్ట్ర ప్రభుత్వం సక్రమంగా పనిచేయడం లేదని మొన్నటి వరకు అసంతృప్తి వ్యక్తం చేసిన గవర్నరు హంస రాజ్ భారద్వాజ్ ఇప్పుడు సీఎం, మంత్రులు బాగా పని చేస్తున్నారని కితాబిచ్చారు. బుధవారం గాంధీభవన్ ఆయన విలేఖరులతో మాట్లాడారు. కొత్త ప్రభుత్వం పూర్తి స్థాయిలో పని చేసేందుకు కొంత సమయం అవసరమని అభిప్రాయపడ్డారు. ప్రజల నుంచి ఎన్నికైన ప్రభుత్వం ప్రజలను సంతృప్తి పరిచే విధంగా పథకాలను చేపట్టాలని సూచించారు.

# వరద బాధితుల కోసం ప్రత్యేక మ్యాచ్

## క్రికెటర్ అనిల్ కుంబ్లే

బెంగళూరు, అక్టోబరు 9 (న్యూస్‌టుడే): రాయల్ ఛాలెంజర్స్- డెక్కన్ ఛార్జర్స్ మధ్య లేదా క్రికెటర్లు, సినిమా నటుల మధ్య మ్యాచ్‌ల నిర్వహణతో వచ్చిన డబ్బును వరద బాధితులకు వినియోగించాల్సిన అవసరం ఉందని అనిల్ కుంబ్లే పేర్కొన్నారు. ఈ దిశలో బి.సి.సి.ఐ. ప్రతినిధులతో తాను చర్చిస్తానని చెప్పారు.

ఎక్కువ సంఖ్యలో మ్యాచ్‌ల ఒత్తిడి ఉన్నప్పటికీ ప్రస్తుత అవసరానికి తగినట్లు ఛారిటీ మ్యాచ్ అవసరం. మంచి పనికి ముహూర్తం చూడాల్సిన అవసరం లేదని విరాళాలు స్వచ్ఛందంగా, ఉదారంగా ఇవ్వాలని విజ్ఞప్తి చేశారు. శుక్రవారం రెడ్‌క్రాస్ సొసైటీ నిర్వహించిన కార్యక్రమంలో కుంబ్లే పాల్గొన్నారు.

**ముందుకు వచ్చిన రెడ్‌క్రాస్**

వరద పీడిత ప్రాంతాల్లోని ప్రజలను ఆదుకునేందుకు రెడ్‌క్రాస్ సంస్థ ముందుకు వచ్చింది. భారతీయ రెడ్‌క్రాస్‌కు మద్దతుగా కెనడా నుంచి రెడ్‌క్రాస్ విభాగం సభ్యులు కర్ణాటకకు వచ్చారు. వరద పీడిత ప్రాంతాల్లోని బాధితులను పరామర్శించి వరద నష్టాన్ని అంచనా వేయనున్నట్లు రెడ్‌క్రాస్ ప్రతినిధి డా.రాజు చంద్రశేఖర్ తెలిపారు. సంస్థకు విరాళాలు, వస్తువులు, దుస్తులు, ఔషధాలు అందించే వారికోసం రేస్‌కోర్సు ఎదురుగా ఉన్న సంస్థ కార్యాలయం 24 గంటలూ పని చేస్తుందన్నారు. మూడు నెలల పాటు విరాళాలు సేకరించి పరిహార కార్యక్రమాలు ప్రారంభిస్తామన్నారు. వేర్వేరు స్వచ్ఛంద సంస్థల సహకారంతో ఇళ్ల నిర్మాణం కూడా చేపట్టాలని నిర్ణయించామని వివరించారు. పాతదుస్తులు కాకుండా కొత్త దుస్తులు ఇచ్చి ఉదారతను చాటాని ప్రజలను కోరారు. సమావేశంలో వేర్వేరు సంస్థల ప్రతినిధులు సురేశ్ హెబ్లికర్, హెచ్.శ్రీనివాసయ్య, వీరసంగయ్య, నరేంద్రనాధ్, అరుంధతినాగ్, జయంత్ కాయ్కిణి తదితరులు పాల్గొన్నారు.



గదు విరాళాన్ని డబ్బాలో వేస్తున్న కుంబ్లే

## ప్రాణదాతలు కండి



ప్రపంచ రక్తదాతల దినోత్సవం సందర్భంగా ఆదివారం రాజ్‌భవన్‌లో రెడ్‌క్రాస్ సంస్థ ఏర్పాటు చేసిన కార్యక్రమంలో రక్తదానం చేస్తున్న వ్యక్తిని అభినంది స్తున్న గవర్నర్ రామేశ్వర్ ఠాకూర్. కార్యక్రమంలో దూరదర్శన్ డైరెక్టర్ డాక్టర్ మహేష్ జోషి, రెడ్‌క్రాస్ సభ్యులు తదితరులు పాల్గొన్నారు.

ఆంధ్రజ్యోతి

శనివారం 9, మే 2009

# రెడ్ క్రాస్ సేవలు ప్రశంసనీయం

బెంగుళూరు మెట్రో,
మే 8 (ఆన్‌లైన్) :
ప్రపంచ వ్యాప్తంగా స్వచ్ఛంద సేవలకు అంకితమైన రెడ్‌క్రాస్ సేవలు ప్రశంసార్హమని ప్రెస్‌క్లబ్ అధ్యక్షులు ఇ.వి.సత్యనారాయణ పేర్కొన్నారు. రేస్‌కోర్స్ రోడ్డులోని రెడ్ క్రాస్ సంస్థ భవనంలో రెడ్‌క్రాస దినోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన కార్యక్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ నిధుల కోసం కేవలం ప్రభుత్వంపై ఆధారపడడం సరికాదన్నారు.

సంస్థలు తాము గడిస్తున్న ఆదాయంలో ప్రజాసేవకు కొంత మొత్తాన్ని అందచేయడం ద్వారా సమాజ సేవకు పాటుపడాలను. దీనిపై ప్రజలలో అవగాహన కల్గించాల్సిన అవసరం ఉందన్నారు.

రెడ్ క్రాస్ సంస్థ కర్ణాటక విభాగం అధ్యక్షులు ఉడిపి కృష్ణ మాట్లాడుతూ ప్రజల ఆరోగ్యం కోసం పర్యావరణంపై ఆధారపడి ఉండడంతో తమ చుట్టు ప్రక్కల పరిసరాలను పరిశుభ్రంగా ఉంచుకోవాలన్నారు. రెడ్ క్రాస్ కర్ణాటక విభాగం కోశాధికారి రామచంద్రశేఖర్ రెడక్రాస్ అభివృద్ధి గురించి వివరించారు.



రెడ్ క్రాస్ దినోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన కార్యక్రమంలో పాల్గొన్న ప్రెస్‌క్లబ్ అధ్యక్షులు ఇ.వి.సత్యనారాయణ, కర్ణాటక రెడ్‌క్రాస్ సంస్థ అధ్యక్షులు ఉడిపి కృష్ణ తదితరులు

# 5 లక్షల వేపచెట్ల పెంపకమే లక్ష్యం

- నటుడు రాఘవేంద్ర రాజ్‌కుమార్



వార్షికోత్సవంలో నటుడు రాఘవేంద్ర రాజ్‌కుమార్‌తో ముఖ్యులు

**ఆంధ్రజ్యోతి, బెంగళూరు:** ఐదు లక్షల వేప మొక్కలు పంపిణీ చేయడం ద్వారా పరిసరాల సంరక్షణ అమలు చేయదలిచామని నటుడు, నిర్మాత రాఘవేంద్ర రాజ్‌కుమార్ వెల్లడించారు. ఆర్ట్ ఆఫ్ గివింగ్ వార్షికోత్సవంలో పాల్గొని మాట్లాడారు. ఇప్పటికే వేపమొక్కల పంపిణీని ఆరంభించామన్నారు. కొన్నేళ్లలోగానే వేపమొక్కలను పెంచి పంపిణీ చేయదలిచామన్నారు. రాజ్‌కుమార్ అభిమానులు సమాజ సేవా కార్యక్రమాలు భాగస్వామ్యులు కావడం సంతోషమన్నారు. అఘోర స్వామిజీ ఆశీస్సులు పొందాక తన మనసులోని భావాలు మారాయని, సమాజ సేవవైపు వెళ్లాలని అప్పుడే నిర్ణయం తీసుకున్నానన్నారు. స్వామిజీ ఆశీర్వాదంతోనే ఆరోగ్యం మెరుగైందన్నారు. ఎమ్మెల్యే విజయకుమార్ మాట్లాడుతూ సాయం చేయడం ద్వారా వచ్చే సంతృప్తికి వెలకట్టలేమన్నారు. కర్ణాటక రాష్ట్ర పోలీస్ హౌసింగ్ బోర్డు అధ్యక్షుడు సుశాంత్ మహాపాత్ర మాట్లాడుతూ విద్యారంగానికి సమాజానికి సేవలు చేసేవారికి ప్రోత్సహించాలన్నారు. మణిపాల్ ఫౌండేషన్ కార్యనిర్వహణాధికారి బాలచంద్రన్ వారియర్, శేషాద్రిపురం విద్యాసంస్థ ట్రస్టు ప్రధాన కార్యదర్శి డాక్టర్ ఉడా పి.కృష్ణ తదితరులు పాల్గొన్నారు.

# జిల్లా కేంద్రాల్లో గాంధీ భవనాలు

బెంగళూరు (హెబ్బాళ), న్యూస్‌టుడే: నేటి తరానికి గాంధీ భావాలపై అవగాహన పెంచే దిశగా అన్ని జిల్లా కేంద్రాల్లో గాంధీ భవనాలు స్థాపించనున్నట్లు ముఖ్యమంత్రి సిద్ధరామయ్య ప్రకటించారు. శుక్రవారం స్థానిక సెంట్రల్ కళాశాల, జ్ఞానజ్యోతి సంభాంగణంలో నిర్వహించిన ఓ కార్యక్రమంలో మాట్లాడుతు ఈ ప్రకటన చేశారు. నేటి యువతకు గాంధి తత్వాల పట్ల కనీస అవగాహన అవసరమన్నారు. గ్రామ స్వరాజ్యం, సర్వోదయం, సత్యాన్వేషణకు ఆయన చూపిన మార్గం, ఆయన నడిచిన బాటలో కర్ణాటక కూడా భాగమవటం అదృష్టమని వివరించారు. స్వాతంత్ర్య సమరయోధుడు హెచ్. ఎస్. దొరెస్వామి మాట్లాడుతూ బహుళ జాతి కంపెనీలు దేశంలో కాలుమోపటం గాంధి విధానాలకు వ్యతిరేకమన్నారు. కార్యక్రమంలో మంత్రులు రోషన్‌బేగ్, ఉమాశ్రీ, న్యూఢిల్లీ గాంధీ జాతీయ స్మారక సంగ్రహాలయం సంచాలకుడు అణ్ణామలై, గాంధీ స్మారక నిధి అధ్యక్షుడు శ్రీనివాసయ్య పాల్గొన్నారు.

### బాపూజీ కోసం ప్రదర్శన

బెంగళూరు (శివాజీనగర), న్యూస్‌టుడే: మహాత్మాగాంధీ కర్ణాటకకు విచ్చేసి నూరేళ్లయిన నేపథ్యంలో వేర్వేరు సంఘాల ప్రతినిధులు నిర్వహించిన ప్రదర్శనలో భారీ సంఖ్యలో విద్యార్థులు పాల్గొన్నారు. నగరంలోని రైల్వేస్టేషన్ నుంచి గాంధీభవన్ వరకు ప్రదర్శనలో కర్ణాటక గాంధీ స్మారక నిధి, సమాచార శాఖ, కన్నడ, సంస్కృతి శాఖ, కర్ణాటక మద్యపాన సంయమన మండలి, బెంగళూరు విశ్వవిద్యాలయం, గాంధీశాంతి ప్రతిష్ఠాన, జాతీయ సేవా యోజన, గాంధీ అధ్యయన కేంద్రం, యువజన సేవల శాఖల ప్రతినిధులు పాల్గొన్నారు. గాంధీజీలా వేషం వేసుకున్న వేమగల్‌కు చెందిన కృష్ణ ప్రదర్శనకు నేతృత్వం వహించారు. మహాత్ముని సందేశాల్ని తెలియజేసే కరపత్రాలను, నినాదాల్ని రాసిన అట్టముక్కల్ని విద్యార్థులు ప్రదర్శించారు. గాంధిభవన్‌లో ఏర్పాటు చేసిన ప్రదర్శనలో మహాత్ముడు తొలిసారి బెంగళూరుకు వచ్చినప్పుడు తీసిన ఛాయాచిత్రం ప్రతి ఒక్కరినీ ఆకట్టుకుంది. బెంగళూరుతో పాటు కర్ణాటకలో ఆయా ప్రాంతాల్లో సంచరించినప్పుడు తీసిన ఛాయాచిత్రాలనూ ఇక్కడ ఆవిష్కరించారు. గాంధి స్మారకనిధి అధ్యక్షుడు హెచ్.శ్రీనివాసయ్య, విద్యా సంస్థల అధ్యక్షుడు వి. డి. కృష్ణ తదితరులు పర్యవేక్షించారు.



ఉత్సవాలు ప్రారంభిస్తున్న ముఖ్యమంత్రి సిద్ధరామయ్య తదితరులు

ఆంధ్రజ్యోతి
కర్ణాటక • ఆదివారం
08 ఫిబ్రవరి 2015

# సౌరశక్తిని సద్వినియోగం చేసుకోండి

## మంత్రి డీకే శివకుమార్ పిలుపు




కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న మంత్రి డీకే శివకుమార్

యలహంక: విద్యుత్ కొరతను ఎదుర్కొంటున్న ప్రస్తుత రోజుల్లో రాష్ట్ర ప్రజలు సౌరశక్తిని సద్వినియోగం చేసుకోవాలని విద్యుత్‌శాఖ మంత్రి డీకే శివకుమార్ పేర్కొన్నారు. శేషాద్రిపురం ఫస్ట్ గ్రేడ్ కాలేజ్, సిటిజన్స్ ఫోరం సంయుక్త ఆధ్వర్యంలో శేషాద్రిపురం కళాశాల సభాభవనంలో ఏర్పాటు చేసిన సౌరశక్తి సమావేశాన్ని ప్రారంభించి మాట్లాడారు. రాష్ట్రంలో 3 జిల్లాలు మినహా మిగిలిన అన్ని జిల్లాల్లో సౌరవిద్యుత్ ఉత్పత్తికి అవకాశం ఉందన్నారు. కావున ప్రజలు సౌరశక్తిని వినియోగించుకునేందుకు ముందుకు రావాలన్నారు. రాష్ట్రంలో 1000-1400 మెగావాట్ల విద్యుత్ కొరత ఉందని దీన్ని అధిగమించేందుకు ప్రభుత్వం కసరత్తు చేస్తోందన్నారు. సౌరశక్తి విద్యుత్ ఉత్పాదనకు ప్రభుత్వం సహకారం అందిస్తోందని, ఆన్‌లైన్‌లో అర్జీలు విడుదల చేయగా ఉత్తమ స్పందన వ్యక్తమైందన్నారు. 1లక్షకుపైగా ప్రజలు సౌరశక్తి కల్పించుకోవడానికి ఆసక్తి చూపారన్నారు. రాష్ట్రంలోని సౌరశక్తి విద్యుత్ పాలసీ దేశంలోనే ఉత్తమంగాఉందని ప్రశంసలకు పాత్రమైందన్నారు. కార్యక్రమంలో ఎమ్మెల్యే ఎస్.ఆర్.విశ్వనాథ్, శేషాద్రిపురం విద్యాట్రస్టు గౌరవ కార్యదర్శి డా.ఉడే పి.కృష్ణ, సిటిజన్స్ ఫక్షరం అధ్యక్షుడు డా.టి.వి.మునియప్ప, తదితరులు పాల్గొన్నారు.